# జననీ జన్మభూమిశ్చ

డాక్టర్ ఎస్.బి. రఘునాథాచార్య

ప్రచురణ

రిజిస్టర్డ్ సంఖ్య 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

'JANANI JANMA BHOOMISCHA'

Selected Verses From VALMIKI RAMAYANAM

With Commentary By

Dr. S B. RAGHUNATHACHARYA



ప్రచురణ : 108

ప్రథమ ముద్రణ : డిసెంబర్, 1984

ప్రతులు : 3,200

వెల : రూ. 6/-

ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాద్

ముఖచిత్ర ముద్రణ :
బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్
చిక్కడపల్లి, హైదరాబాద్

ప్రతులకు :

యువభారతి
5. కింగ్స్‌వే, సికిందరాబాదు - 500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు - 500001

# యువభారతి పరిచయము

ఉత్తమ అధ్యయనంవల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. సమాజంలో సామరస్యం పెంపొందుతుంది. ఉత్తమ భావ ప్రసరణానికి పుస్తకాలు చక్కని సాధనాలు. అందరికీ అందుబాటులో ఉండే విధంగా మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని, కడచిన ఇరువయ్యేళ్ళుగా పాత కొత్తల మేలు కలయికను ప్రాతిపదికగా పెట్టుకొని, 107 పుస్తకాలను ప్రచురించింది. ఉపన్యాస మంజరి కార్యక్రమాలను, సదస్సులను నిర్వహించింది.

సహృదయుల సహకారంతో, పుస్తకాల అమ్మకంవల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ, తక్కువ వెలకు ఎక్కువ విలువ వున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని ప్రచురణలను వెలువరిస్తున్నదే కాని, మా సంస్థ వ్యాపార సంస్థ కాదు.

భారత దేశంలో ఎక్కడున్నా సరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 8500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 1100 మంది, భారతీ భూషణులుగా 125 మంది చేరారు.

హైదరాబాదు
డిసెంబర్ 7, 1984

**ఇరివెంటి కృష్ణమూర్తి**
అధ్యక్షులు, యువభారతి

# మా మాట

## "జననీ జన్మభూమిశ్చ"

"నీ తల్లి, నీ మాతృదేశం ముందు స్వర్గం ఏపాటిది? స్వర్గం గొప్పది అయితే అవునుగాక, నా జన్మభూమికంటే గొప్పదేమీ కాదు" అన్న సందేశాన్నిస్తున్న పురాణేతిహాసాలు పుక్కిటి పురాణాలు అని కొన్ని అబద్ధాలను నూరిపోసి, భావదాస్యానికి గురిచేసి, బ్రిటిష్ వాళ్లు భారతీయుల ఉపజ్ఞను, ప్రతిభను, పురావైభవ ప్రతిపత్తినీ, సంప్రదాయ ప్రీతినీ భ్రష్టం చేసినారు. సంస్కృతంతో మనం విడివడిపోయిన్నాడే, జ్ఞానం కోసం పాశ్చాత్యులపట్ల ప్రమాణ బుద్ధి పెనుచుకోవలసిన అగత్యం ఏర్పడింది. విజ్ఞానానికి ఎల్లలు లేవు. అది అనంతం. ప్రాచ్య పాశ్చాత్య భేదాంతో విజ్ఞానానికి సంబంధం లేదు. భారతీయ ఋషులు ఈ యాథార్థ్యాన్ని ఎన్నడో గుర్తించినారు. మంచి ఎక్కడున్నా గ్రహించవలసిందే. ఒక భాషతో పరిచయం లేనంత మాత్రాన 'ఆ భాషలో జ్ఞానమే లేదు' అనే అజ్ఞతకు గురికాకూడదు. సంస్కృత భాష విజ్ఞాన భాండాగారం. కొన్ని లక్షల సంవత్సరాల అనుభవసారం. అన్ని భారతీయ భాషల్లో సంస్కృత భాషాచ్ఛాయ ఉన్నవి. అయితే రంగద్దాలతో చూస్తే, వ్యాధిగ్రస్త నేత్రాలతో చూస్తే ఆ నీడల జాడలు కనిపించక పోవచ్చు. విశ్వ సాహితిలోనే రామాయణం ఆదికావ్యం. వాల్మీకి అంటేనే కవి. భారతీయులకు ఏ విలువలపట్ల ఆదరాభిమానాలున్నవో ఆవిలువలనే వాల్మీకి కావ్యబద్ధం చేసినాడు. రామాయణం చదవనివాడు ఏమీ చదువనివాడే.

ఆదికవి వాల్మీకి రామాయణంలోని కొన్ని విజ్ఞానప్రదములైన, ధర్మనీతి బోధకములైన, రసస్ఫోరకములైన శ్లోకాలను గ్రహించి, వాటికి సరళమైన తెలుగు భాషలో వ్యాఖ్యానం వ్రాసి ఇచ్చి, ప్రచురించుకునే అవకాశాన్ని మాకు కలిగించిన వారు డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్యులుగారు- తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం- సంస్కృత శాఖలో రీడరు- సంప్రదాయ పద్ధతిలో సంస్కృత సాహిత్యాధ్యయనం చేసిన వుత్పన్నులు. సంస్కృతాంధ్రాంగ్లాది భాషలలో చక్కని అభినివేశాన్ని సంపాదించి, భారతీయ సంస్కృతి ప్రసరణానికి ఇతోధిక కృషి చేస్తున్న విశిష్ట వ్యక్తులు. బహు గ్రంథ ప్రణేతలు. వ్యాకరణ, తర్క, వేదాంత, సాహిత్య శాస్త్రాలతో మంచి పరిచయమున్నవారు. నిరంతరాధ్యయనం, గ్రంథ రచనం, బోధనం ఆయన, తమ మనః ప్రవృత్తిగా మలచుకున్నారు. మా 'యువభారతి' నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి తమ ఆశీర్వాదాన్ని అందిస్తున్న సహృదయులు. డాక్టర్ ఎస్. బి. రఘునాథచార్యులుగారికి మా ధన్యవాదములు, అభివందనములు.

ఇరివెంటి కృష్ణమూర్తి

# ముందు మాట

అలౌకికానుభూతులకు అద్దంపట్టిన ఆర్షవాఙ్మయసారమే అజరామరుడైన ఆదికవి మనకందించిన శ్రీమద్రామాయణం. దీనితోనే లౌకిక సాహిత్యావతరణం జరిగింది. వాల్మీకి మహర్షి దీన్నే 'పౌలస్త్యవధం' అనీ, 'సీతాచరితం' అనికూడా పిలుచుకున్నాడు. వేదవేద్యుడైన భగవాన్ దాశరథిగా అవతరించగా, వేదమే ప్రాచేతసముని ప్రయత్నంవల్ల పౌలస్త్యవధంగా పరిణమించింది. కమనీయమైన కవితాస్రవంతి క్రాంతదర్శి అయిన కవితల్లజుని నోట ప్రవహించింది. ఇతిహాస హాసం, కవితా విలాసం సమ ఉజ్జీలుగా సాక్షాత్కరించాయి. మృదుమధురమైన భాష, దాన్ని మించిన శయ్య, దాన్ని తోసిరాజనే శైలి అహమహమికతో ఆదికవి రసనాగ్ర రంగస్థలిపైన రసమయ రమణీయ నృత్యాన్ని చేసినాయి. పరిశీలిస్తే భారతీయులమైన మనమెంతో ధన్యులం. ఆ మహర్షి పుట్టిన గడ్డపై పుట్టగలిగినందుకు. అమర భారతిచేత ఆయన చేయించిన అందాల నృత్యాలను తిలకించ గలిగినందుకు. నిజంగా లోకాలన్నింటిలో సకల సుఖాలకు ఆటపట్టయిన స్వర్గ లోకం గొప్పది. దానికంటే మనకందఱకు జన్మనిచ్చిన జనని, జన్మభూమి ఎంతో గొప్పది.

ధీదాత్తతకు దిద్దిన రూపమే శ్రీరామచంద్రుడు. ధర్మ మేరూపంలో ఉంటున్నదని ప్రశ్నిస్తే 'రామో విగ్రహవాన్ ధర్మః' అని చెబుతారు పెద్దలు. సాధుజన సంరక్షణానికి సరైన తరుణంలో అతరించిన ఆదిదేవుడే ఆ దాశరథి. ఆదర్శ పుత్రుడు, ఆదర్శ భర్త, ఆదర్శ సోదరుడు, ఆదర్శ మిత్రుడు, చిట్ట చివరకు ఆదర్శ శత్రువు కూడా శ్రీరామచంద్రుడే అని యుగయుగాలనించి చెప్పుకుంటున్న మాట. ఆయన గడిపిన నిస్వార్థ త్యాగమయ జీవితం మనకు కూడా కావాలి, ఒక నిత్యనూతన సందేశం.

రామాయణాన్ని పవిత్రమైన పారాయణ గ్రంథంగా ప్రతినిత్యం పఠించే వాళ్ళు ఈ దేశంలో లేకపోలేదు. అందులో ఉన్న అంతరార్థాలను వాళ్ళు అవ గాహన చేసుకుంటూనే ఉన్నారు. అలాగే రామాయణాన్ని అపార్థం చేసుకొని అవమానాలపాలైనవాళ్లూ లేకపోలేదు. అందుకే సమాజంలో ప్రతివాడికీ ఆదికవి

అందించిన అమృత సందేశం అందుబాటులోకి రావాలనే తపన నాలో ఏనాడో చోటుచేసుకుంది. ఆ దృష్టికోణంలో ఎందరెందరో కృషిచేసి కృతార్థులైనారు. సమాజంలోని అన్ని వర్గాలకు, వృత్తులకు, సామాన్యులకు కూడా అవసరమైన పద్ధతిలో కొన్ని మూల శ్లోకాలను తీసుకొని సరళంగా, సులభంగా, ఆదికవి హృదయం అందుబాటులోకి వచ్చేటట్లు వ్యాఖ్యానం చేయాలని ఎంతకాలంనుంచో తీరని ఓ కోరిక ఉంది. అది ఈనాడు 'జననీ జన్మభూమిశ్చ' అనే పేరుతో అక్షరరూపాన్ని ధరిస్తున్నది. అసలే ఇది తీరని కోరిక, పదిమందీ పది కాలాల పాటు పదిలంగా ఉపయోగించుకొనే పుస్తక రూపాన్ని అది ధరించడంకంటే నాకు వేతే ఆనందమేముంటుంది ?

ప్రతి సందర్భం ఈనాటి సమాజానికి బాగా ఉపయోగపడాలని చక్కని శీర్షికల నిస్తూ, ఔచిత్యం చెడకుండా, ప్రతినిత్యం అందఱు చదువుకొనేలా మధుర పదాలతో వ్యాఖ్యానం చేశాను. దీన్ని తయారుచేసేటప్పుడు నా దృష్టి పండితులమీదకంటే, సంస్కృతంతో పెద్దగా పరిచయంలేని సామాన్యులపైన, రామాయణంలో ఏముంది ? అని రచ్చబండలపైన పిచ్చిపిచ్చిగా మొరిగే వాగుడు కాయలపైన కూడా ఉంది. సంస్కారంతో ఎదిగి తనకోసం కాక ఈ సమాజం కోసం నిస్వార్థంగా దేన్నైనా త్యాగం చేయగలిగిన నిండైన మానవుని చరిత్ర, ప్రజలకు కావలసిన నీతి, ప్రభువులకు అవసరమైన రాజనీతి- ఇలా ఇంకెన్నో రామాయణంలో ఉన్నాయని ఇప్పటికైనా గ్రహిస్తే, వాళ్ళు బాగుపడటం ఎలా ఉన్నా మిగతా సమాజమైనా చెడిపోకుండా ఉంటుంది. అది కొంతకు కొంత జరిగినా నా ఆలోచన సఫలమైనట్లే.

జననికి, జన్మభూమికి ఒకేసారి సేవచేసే ఈ ఆనందాన్ని నా కందించిన వారు నేటి యువకుల్లో సాహిత్యపరమైన నిత్యనూతన చైతన్యాన్ని అన్వర్థమైన 'యువ భారతి' అనే పేరుతో భాగ్యనగరంనుంచి అందిస్తున్న సహృదయ మిత్రులు. విశేషించి సుహృన్మణులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారు (యువ భారతి, అధ్యక్షులు), శ్రీ వై. వివేకానందంగారు (యువభారతి, కార్యదర్శి) ఈ అధ్వరానికి నన్ను వరించిన సరస హృదయులు. వారికి, ఇతర సభ్యు లందఱికి నా కృతజ్ఞతామందారాల నందిస్తున్నాను.

'రామో ద్విర్నాభి భాషతే'

—రఘునాథాచార్య

సాహిత్యాన్ని వీలున్నంత ఎక్కువ మందికి అందించి, సమాజంలో మంచిని పెంపొందించాలనే సత్సంకల్పముతో యువభారతి స్థాపించబడింది. యువభారతితో అందరూ సాహితీ బాంధవ్యాన్ని పటిష్టం చేసుకోవాలనే ఉద్దేశ్యంతో ''భారతీమిత్ర'' సభ్యత్వ పథకాన్ని చేపట్టింది.

## యువభారతి భారతీమిత్ర పథకం:-

ప్రతి సంవత్సరం రూ॥ 10/- చందా చెల్లించి సాహితీ మిత్రులుగా పరిగణించబడేకంటే, ఒకేసారి "నూట పదహార్లు'' అందించి శాశ్వత సభ్యులుగా చేరి యావజ్జీవితం యువభారతి నుండి సదుపాయాలను అందుకోగలరనే ఉద్దేశ్యంతో రూపొందించబడినదే ''భారతీ మిత్ర" సభ్యత్వ పథకం.

## భారతీ మిత్రులు కావాలంటే :

* కేవలం రూ॥ 116/-లు చెల్లించటంతో మీరు శాశ్వతంగా యువభారతి ''భారతీ మిత్రులు''గా పరిగణింప బడతారు. పై మొత్తాన్ని ఒకేసారి చెల్లిస్తే మంచిది.

* ఒకేసారి రూ॥ 116/-లు చెల్లించలేకపోతే మొదటి వాయిదాగా రూ॥ 16/-లు చెల్లించి, మిగిలిన మొత్తాన్ని నెలకు రూ॥ 10/-ల చొ॥న పది సమానమైన వాయిదాలలో చెల్లించవచ్చు.

* మొదటి వాయిదా రూ॥ 16/-లు చెల్లించగానే మీకు ''భారతీ మిత్ర'' సభ్యత్వ సంఖ్య కేటాయించబడుతుంది. యువభారతి ప్రచురణల నుండి మీరు ఎన్నుకొన్న రూ॥ 12/-ల విలువగల పుస్తకాలను అందుకుంటారు.

* మొత్తం రూ॥ 116/-లు చెల్లించినవారు మాత్రమే యువభారతి "భారతీ మిత్రులు''గా పరిగణింపబడతారు.

## పూర్తి సభ్యత్వం చెల్లించి భారతీ మిత్రులయితే మీకు :

* "భారతీమిత్ర" గుర్తింపు కార్డు అందజేయబడుతుంది.

* ప్రతి సంవత్సరము రూ॥ 12/-ల విలువగల యువభారతి ప్రచురణలు (ప్రచురణలపై పేర్కొన్న వెల ప్రకారం) జీవిత పర్యంతం అందజేయబడతాయి.

*గమనిక :* పుస్తకాలు పోస్టులో పొందగోరే మిత్రులకు, రూ॥ 12/- విలువగల పుస్తకాలను పోస్టేజి మేరకు అంటే దాదాపు రు. 3-00లకు వి.పి.పి. లో పంపించడం జరుగుతుంది. మిత్రులు ఆ మొత్తాన్ని చెల్లించి, తమ భారతీ మిత్ర సభ్యత్వ పుస్తకాలను విడిపించుకో మనవి పుస్తకాలు మిత్రులకు భద్రంగా చేరేందుకు వీలుగా ఈ చిన్న మార్పు చేయడం జరిగింది. స్థానికేతరులైన భారతీ మిత్రులు దీనిని గమనించి సహకరించ ప్రార్థన.

* యువభారతి ప్రచురణల నన్నింటినీ 30% మినహాయింపుతో మీ సొంతం చేసుకొనే సదుపాయాన్ని శాశ్వతంగా పొందవచ్చు. పోస్టేజి అదనం అని గమనించండి.

**అపి స్వర్ణమయీ లంకా న మే లక్ష్మణ! రోచతే।**

**జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ॥**

'లక్ష్మణా! బంగారంతో తళతళా మెరిసిపోయినా ఈ లంకా పట్టణం నన్నాకర్షించడం లేదు. అయినా కన్నతల్లి, కన్నదేశం స్వర్గం కంటే చాలా గొప్పవి కదా!'

శత్రువు చనిపోయాడు. లంకా పట్టణం నిశ్శంకగా హస్తగతమైంది. అయోధ్యలో భరతుడు శత్రుఘ్నుడు ఉన్నారు. లంకా పట్టణాన్ని తానైనా పాలించవచ్చు, లేదా లక్ష్మణునికైనా ఇవ్వవచ్చు. కాని ఆ ధర్మమూర్తి అలా చేయలేదు. ఈ లంక ఎంత సిరిసంపదలు గలదైనా కావచ్చు, మనకెందుకయ్యా అన్నాడు. జనని, జన్మభూమి - ఈ రెండూ స్వర్గం కంటే ఎంతో గొప్ప వన్నాడు. వారసుడైన విభీషణుడికే పట్టం కట్టాడు. ఆయనెవరో తెలుసా? త్యాగానికి మరోపేరు. ఆయన పేరు శ్రీరామచంద్రుడు.

# జననీ జన్మభూమిశ్చ

ఇందులో

## 1. బాలకాండ



## 2. అయోధ్యాకాండ

21. దైవ ప్రభావాన్ని ఎవరూ గుర్తించలేరు
22. ప్రయత్నించు! విధిని ప్రతిఘటించు!
23. పతియే ప్రత్యక్ష దైవం
24. భర్తను ధిక్కరించి బాగుపడటం కష్టం
25. దేవుణ్ణి పూజించకపోయినా...
26. రాజానుగ్రహం ఎలా పొందడం?
27. భర్త అదృష్టానికి భార్యే వారసురాలు
28. సతికి పతే గతి
29. పెద్దలసేవకు పెద్దది ఫలితం
30. ఎవరు పురుషోత్తముడు?
31. తండ్రినిబట్టి కొడుకు; తల్లినిబట్టి కూతురు
32. ఆడదానికి అంతా ఆత్రమే
33. అతివల మనస్సు అతి చంచలం
34. వందమంది కొడుకులున్నా...
35. భర్తనెవరు పూజించరు?
36. శోకాన్ని మించిన శత్రువు లేదు
37. చేసుకున్నవాడికి చేసుకున్నంత
38. ఎందులోనైనా ముందుచూపు ముఖ్యం
39. రాజులేని రాజ్యం అన్నింటికీ పూజ్యం
40. ప్రభువు లేనిచోట ప్రతివాడూ ప్రభువే
41. సమర్థుడైన రాజే సత్యధర్మాలకు పుట్టిల్లు
42. ప్రజలకు సర్వస్వం ప్రభువే
43. పిల్లవాడి తరవాతే తల్లి కెవరైనా
44. గిట్టనివాడిని వదలిపెట్టాలి
45. ఒక మేధావి చాలు
46. సేవకుల కోపం పాలకులకే తాపం

47. ప్రభుదోషాలు పధ్నాలుగు
48. మన చేతుల్లో ఏమీలేదు
49. పెరుగుట విరుగుట కొఱకే
50. చావును మించిన భయం లేదు
51. తీరిపోయిన కాలం తిరిగి రానేరాదు
52. నీ గురించి నువ్వేడవటం మంచిది!
53. మృత్యుదేవత నీ వెంటే ఉంటుంది
54. ఎంత పిచ్చిది లోకం!
55. ఎక్కడి పెళ్ళాం? ఎక్కడి పిల్లలు?
56. ఒకరు ముందు; ఇంకొకరు వెనుక
57. దుఃఖాన్ని దూరంగా నెట్టు
58. ఒంటరిగానే వచ్చి ఒంటరిగానే పోతున్నాడు
59. ఇవన్నీ అతిథి భవనాలే
60. మర్యాదను కోల్పోతే మంచివాళ్ళు మెచ్చరు
61. నడవడినిబట్టి కులగోత్రాలు
62. యథారాజా తథాప్రజాః
63. సత్యంలోనే లోకం ఉంది
64. సత్యాన్ని సాధిస్తే స్వర్గాన్ని పొందచ్చు
65. సత్యాన్ని మించిన స్థానమే లేదు
66. ముగ్గురు గురువులు
67. ఎలాంటివాడైనా భర్తే దైవం
68. ఆడపిల్లల తండ్రికి అంతే మర్యాద

## 3. అరణ్యకాండ

69. కామంవల్ల మూడు ప్రమాదాలు
70. ధర్మమూల మిదం జగత్
71. బాగుంటేనే భామల మెప్పు

72. ఆడ మనసుకు మూడు లక్షణాలు
73. ప్రజలను భయపెట్టే ప్రభువు నిలవడు
74. రావలసింది రానే వస్తుంది
75. మదించిన మహీపతిని ఎవ్వరూ మన్నించరు
76. అదునులో చేయకపోతే అంతా గందరగోళమే
77. కష్టాల్లో కన్నెత్తైనా చూడరు
78. తనవాడే తాట ఒలిచేస్తాడు
79. గద్దె దిగితే గడ్డిపరకతో సమానం
80. పదవిపోతే పనికేరాడు
81. ఆ రాజుకు ఢోకాలేదు
82. కళ్లు మూసినా మెలకువగా ఉండాలి
83. చెప్పేవాడు వినేవాడు లేడు
84. పాపితో చేరితే ఆపదలు తప్పవు
85. అంతకంటే పాపం లేదు
86. తోడేలు చేతుల్లో మేకలు బతుకుతాయా?
87. దేనికైనా పాపం పండాలి
88. పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతోగాని పోదు
89. తలకు మించిన తలగుడ్డ
90. చావబోయేవాడికి చక్కటి మాటలు రుచించవు

## 4. కిష్కిన్ధాకాండ

91. అతిస్నేహం అనర్థదాయకం
92. ఉత్సాహంతో దేనైనా సాధించవచ్చు
93. వివేకముంటే వినాశం తప్పుతుంది
94. సోమరివానికి శోకం తప్పదు
95. స్నేహితునికోసం ఏమైనా ఇవ్వచ్చు
96. మిత్రుడు - శత్రువు

97. ఏలికుండాల్సిన ఎనిమిది గుణాలు
98. నరకానికి వెళ్ళే నల్గురు నరాధములు
99. దేశకాలజ్ఞుడైన దేశాధిపతి
100. ముగ్గురూ తండ్రులే
101. ముగ్గురు కొడుకులు
102. మరణదండనే సరైన శిక్ష
103. ఎవణ్ణి గురించి ఏడుస్తున్నావు?
104. మధ్యేమార్గంలో మనుగడ సాగించాలి
105. ఎన్ని ఉన్నా విధవరాలే
106. అన్ని దానాలకంటే మిన్న కన్యాదానం
107. దేంట్లోను కర్తృత్వం లేదు
108. కాలానికి చుట్టరికమేముంది?
109. నాలుగూ సరిగా ఉంటేనే రాజ్యం
110. వాడే పురుషాధముడు
111. ఎవడు పురుషోత్తముడు?
112. స్నేహాన్ని నిలుపుకోవడం చాలా కష్టం
113. కృతఘ్నుడికి నిష్కృతి లేదు
114. క్రిందపడితేనే తెలుస్తుంది
115. సామోపాయానికి సరి ఏదీలేదు
116. విషాదంవల్ల వినాశం తప్పదు

## 5. సుందరకాండ

117. అతిథిని గౌరవించాలి
118. నాలుగు గుణాలుంటే నాశమే ఉండదు
119. దూతనుబట్టే కార్యసిద్ధి
120. మంచికి చెడుకు మనస్సే కారణం
121. నిరుత్సాహంతో నీరసించిపోకు!

122. బ్రతికుంటే బలుసాకు తినచ్చు
123. పరితపించాడు పరమేశ్వరుడు
124. ఆడదానికి భర్త అలంకారాలకే అలంకారం
125. సంభాషణ సంస్కారంతో ఉండాలి
126. చాపల్యంవల్ల చులకనై పోతారు
127. ఆచరణలేని జ్ఞానం అక్కఅకు రాదు
128. నీతి నియమాలు లేకపోతే...
129. పాపిష్టివాడు పోతే ప్రజలు సంతోషిస్తారు
130. రమ్మన్నప్పుడు మృత్యువు రానేరాదు
131. వాళ్లే నిజంగా ధన్యులు
132. అలాంటి మహాత్ములకు నమస్కారం
133. ఎప్పుడూ కష్టాలే ఉండవు
134. ఏ పరిస్థితుల్లోను విధి వెంటనే ఉంటుంది
135. దయను మించిన ధర్మం లేదు
136. చిన్నవాణ్ణే దూతగా పంపాలి
137. చూచిరమ్మంటే కాల్చివస్తాడు
138. పాముసడక పాముకే తెలుస్తుంది
139. కోటికొక్కడే కోపాన్ని జయిస్తాడు
140. కోపోద్రేకం కొండంత తప్పును చేయిస్తుంది
141. ఓర్పుతో కోపాన్ని నిర్జించు!

## 6. యుద్ధకాండ

142. ఉపేక్షించడం ఉచితం కాదు
143. పరస్త్రీలకోసం పాకులాడకూడదు
144. ముందువెనుకల్లో తొందరపడకూడదు
145. సమీక్షించి సలహా ఇవ్వాలి
146. శత్రుసేవకునితో స్నేహం పనికిరాదు

147. అంటీ అంటని స్నేహం
148. అయోగ్యులతో స్నేహం ఆశాభంగాన్ని కలిగిస్తుంది
149. మంచిగా ఉన్నట్టే పొంచి దెబ్బతీస్తారు
150. పని ఇస్తేనే పనితనం తెలుస్తుంది
151. శరణాగతుణ్ణి కరుణించాలి
152. అన్నీ మంచి గుణాలైతే అసమర్థుడంటారు
153. స్త్రీకి వైధవ్యమే మరణం
154. మూడు యుక్తులతో ముల్లోకాలను జయించవచ్చు
155. ఏది కృతయుగం? ఏది కలియుగం?
156. ఒక్కడివల్ల అందరు నశిస్తారు
157. సత్య-ధర్మాలుంటే చావంటే భయముండదు
158. నకిలీ నాయకులను నమ్మకూడదు
159. శత్రువు నుపేక్షిస్తే శాశ్వతనాశం తప్పదు
160. పోయిందేదో పోయింది; ఇప్పుడు జాగ్రత్తపడు!
161. వాడే మిత్రుడు; వాడే బంధువు
162. ధనమూలమిదం జగత్
163. పరాయివాడు పరాయివాడే
164. పరపక్షం పంచ పరలోకానికి మంచె
165. మూడు దోషాలుంటే ముంచేస్తాయి
166. వ్యర్థప్రతిజ్ఞలు అనర్థాలకు మార్గాలు
167. వైరాలన్నింటికి మరణమే సరిహద్దు
168. మంచికి మంచి; చెడుకు చెడు
169. చచ్చిపోవడానికి పిచ్చినెపమేదో కావాలి
170. పతివ్రతల కన్నీళ్లు ఫలితం లేకుండాపోవు
171. తప్పు చెయ్యనివాడెవడు?
172. స్త్రీకి సౌశీల్యమే నిజమైన ఆవరణం

## 7. ఉత్తరకాండ

173. ఆపదలో అందరినీ ఆదుకోవాలి

# జననీ జన్మభూమిశ్చ

## బాలకాండ

**1. అబ్బ! ప్రజలెంత మంచివాళ్ళు!**

**కామీ వా న కదర్యో వా నృశంసః పురుషః క్వచిత్,**

**ద్రష్టుం శక్యమయోధ్యాయాం నా విద్వాన్న చ నాస్తికః॥ 6-8**

అయోధ్యలో కాముకుడు గాని, కటికవాడు గాని, లోభిగాని, మూర్ఖుడు గాని, నాస్తికుడు గాని గాలించినా ఎక్కడా కనపడేవాడు కాదు.

ఎంత గొప్ప పరిపాలన! ప్రభుత్వం మంచి చెడ్డలు ప్రజలను చూసి పసిగట్టచ్చు. ప్రభువు ధార్మికుడైతే ప్రజలు కూడా ధార్మికంగా జీవించడానికి ప్రయత్నిస్తారు. అధిపతి అవినీతిపరుడైతే లోకమంతటా అవినీతి అల్లుకు పోతుంది. రాజులో పుష్కలంగా మంచిగుణాలు ఉంటే ప్రజలు కూడా గుణ వంతులౌతారు. 'యథా రాజా తథా ప్రజాః' అని కదా ఆర్యోక్తి!

**2 యౌవనం క్షణికమైంది :**

**చలం హి యౌవనం నిత్యం మానుషేషు విశేషతః। 32-17**

మధ్యలో వచ్చే యౌవనం మధ్యలోనే మాయమైపోతుంది. స్థిరంగా ఎప్పటికీ ఉండదు. అందులోను మానవుల్లో మరీ తొందరగా పోతుంది.

మిడిమేలపు యౌవనాన్ని చూసి మిడిసి పడకూడదు. ఎందరో పుట్టారు. యౌవనపు పొంగులతో ఎగిరెగిరి పడ్డారు. సౌందర్యసార సర్వస్వం తామే అనుకున్నారు. తమలోగాక సౌందర్యం ఇంకెక్కడుందని ప్రశ్నించారు. సౌందర్యదేవత తమనే వరించిందనుకొన్నారు. కాని అనుకున్నంత సేపు పట్టలేదు; వారిని అవలక్షణాలు ఆవరించడానికి. జుట్టు తెల్లబడిపోయింది. పళ్ళు ఊడి పోయాయి. ఇంద్రియాలు పటుత్వం తప్పిపోయాయి. చర్మం ముడతలు పడి

పోయింది. ఏదీ? ఇప్పుడెక్కడుంది వారి యౌవనం? ఏమైపోయింది ఆ తారుణ్యం ఏ మూల దాక్కుంది ఆ మిసమిస? మానవుల యౌవనం మహా క్షణికమైంది. అందుకే పొంగునను చూసి పొంగిపోకూడదు. మళ్ళా ఒకనాడు కుంగిపోవలసి వస్తుంది.

3. **సహనంలోనే సర్వం ఉంది :**

**అలంకారో హి నారీణాం క్షమా తు పురుషస్య వా।**

**క్షమా దానం క్షమా యజ్ఞః క్షమా సత్యం హి పుత్రికా॥**

**క్షమా యశః క్షమా ధర్మః క్షమయా నిష్ఠితం జగత్॥ 33-8**

మొగవాళ్లకైనా ఆడవాళ్లకైనా ఓర్పే ఒక ఆభరణం. అంత మాత్రమే కాదు; ఓర్పుతో ఉండటమే గొప్పదనం, అదే సత్యం, అదే కీర్తి, అదే ధర్మం. ఇంతెందుకు? ఈ సమాజం సహనంలోనే సమగ్ర స్వరూపాన్ని రూపుదిద్దుకో గలుగుతుంది.

నిజమే! ఎంతటి సౌందర్యరాశినైనా సహనంలోపిస్తే సమాజం ఆదరించదు. ఎంతటి గొప్పవాడైనా ఓర్పులేని మానవుడు తోటివారి మన్నన పొందలేడు. ఓర్పులేనివాడు ఎన్నిదానాలు చేసి ఏం ప్రయోజనం? ఎన్ని అధ్వరాలను అనుష్ఠించి ఏం లాభం? ఎంతటి సత్యవాది అయినా ఏం సార్థకం? ఎన్ని కీర్తిప్రతిష్ఠలు పొందినా ఏం ఉపయోగం? ఎంతటి ధార్మికుడైనా ఎవరు విలువనిస్తారు? నేర్పుతో ఓర్పుతో ఏది చేసినా పదిమంది మెచ్చుకుంటారు. ఓర్పులేకుండా ఎన్ని గుణగణాలున్నా, ఎన్ని ఘనకార్యాలు చేసినా అవి బూడిదలో పన్నీరే అవుతాయి. కాబట్టి ఓర్పును పెంచుకోవడానికి ప్రతివాడూ ప్రయత్నించాలి.

4. **అదృష్టమే అన్నింటికీ మూలం :**

దైవమేవ పరం మన్యే పౌరుషం తు నిరర్థకమ్।

దైవేనాక్రమ్యతే సర్వం దైవం హి పరమాగతిః॥ 58-22

అదృష్టబలం ముందు పౌరుషం నిష్ప్రయోజనమే అవుతుంది. ఈ లోక మంతా అదృష్టాధీనంగానే నడుస్తున్నది. అదృష్టమే అన్ని కార్యాలలోను అందరికీ శరణ్యం.

మానవుడు శక్తివంచన లేకుండా ఎన్ని ప్రయత్నాలు చేసినా దైవం అనుకూలంగా ఉంటేనే అవి ఫలిస్తాయి. దైవమంటే ఏదో కాదు; అదృష్టమే. ఈ లోకంలో ఏదైనా అదృష్టానికి అవలీలగా లొంగిపోతుంది. దాన్ని ఎదిరించి

పోరాడటం ఎవరివల్లా కాని పని. ఎంత గొప్పవారైనా అదృష్టాన్ని అనుసరించి పోతేనే కార్యసిద్ధి కలుగుతుంది.

**5. తండ్రికి పెద్దవాడు; తల్లికి చిన్నవాడు :**

**ప్రాయేణ హి నరశ్రేష్ఠ జ్యేష్ఠాః పితృషు వల్లభాః।**
**మాతౄణాం తు కనీయాంసః తస్మాద్రక్షేత్కనీయసమ్॥** 61-19

సామాన్యంగా లోకంలో తండ్రికి పెద్ద కొడుకు మీద, తల్లికి చిన్న కొడుకు మీద ప్రేమాభిమానాలు హెచ్చుగా ఉంటాయి.

విధిపరంగా వివిధమైన అధికారాలు, వద్దన్నా పెద్ద కొడుక్కు సంక్రమించి తీరుతాయి. గృహస్థ ధర్మాన్ని స్వీకరించిన తరువాత, ప్రేమాస్పద అయిన ధర్మపత్నికి కలిగిన మొట్టమొదటి సంతానంపైన తండ్రికి ఉండే ప్రేమాభిమానాలు ఇంతా అంతా అని చెప్పడం అలవికానిపని. అది అనుభవైకవేద్యం. అలాగే ఎందఱినో సంతానాన్ని కన్న తరువాత ఆమె మాతృత్వపు మధురస్మృతులను మళ్ళీమళ్ళీ జ్ఞాపకం చేసేవాడు చిన్నవాడు. అందఱు పిల్లలు పెద్దవాళ్లై అల్లారుముద్దుగా చిన్నవాణ్ణి పెంచుకుంటారు. పెద్ద పిల్లల ఆదరంతోపాటు అమ్మ అభిమానం కూడా చిన్నవాడి మీద పెరగటం సహజం. అలాగే అనురాగంతో పెంచి పెద్దచేసి అత్యున్నతస్థానానికి తీసుకువచ్చిన తండ్రిపైన పెద్ద కొడుక్కు ఎనలేని అభిమానం తనకంటే పెద్దవాళ్లెందఱున్నా తనను ఆప్యాయతతో పెంచిన అమ్మపైన చిన్నవాడికి ఆదరాభిమానాలు అందఱి కంటే ఎక్కువే ఉంటాయి.

**6. ఎవ్వరినీ తిరస్కరించకు :**

**న చావజ్ఞా ప్రయోక్తవ్యా కామక్రోధవశాదపి।** 13-13

కామ-క్రోధాలు కట్టలుతెంచుకున్నా కావాలని ఎవ్వరినీ ధిక్కరించకూడదు.

అహంకారం అందరినీ ధిక్కరింపజేస్తుంది. 'నేనే చేశాను' 'నావల్లనే జరిగింది' అని అన్నింటికీ తానే ముఖ్యమనే భావాన్ని ఆవహింపజేస్తుంది. అంతటితో అయ్యగారు ఆకాశంలో చూస్తుంటాడు. అరచి గీపెట్టినా అతని చూపు ప్రక్కవాళ్ళపైకి రానీయడు. మఱి కామక్రోధాలు కైదోడులైతే ఎవ్వరూ కనీవినీ ఎఱుగనట్లుంటుంది అతని ప్రవర్తన.

ముందు తనలో ఉన్న అహంకారాన్ని అణచివేయాలి. అప్పుడే ఇతరుల్లోని మంచి కనబడుతుంది కామక్రోధాలకు కట్టుబడవలసి వచ్చినా ఇతరులనెవ్వరినీ చిన్నచూపు చూడకూడదు.

7. దయతో దానం చేయాలి:

అవజ్ఞయా న దాతవ్యం కస్య చిల్లీలయాఽపివా।
అవజ్ఞయా కృతం హన్యాద్దాతారం నాత్ర సంశయః॥ 13-30

దీనులకు ధిక్కారంతోగాని, లెక్కలేనితనంతోగాని, వేళాకోళానికిగాని దానం చేయకూడదు. అలా ధిక్కారంతో చేసిన దానం ఇచ్చినవాణ్ణి నాశనం చేస్తుంది.

అన్ని మదాల్లోను ధనమదం చాలా భయంకరమైంది. తన అధీనంలోకి వచ్చిన ధనధాన్యాలకు తాను ధర్మకర్తననే భావం ఉండాలి గాని, సమస్తానికి తానే సర్వ్రమాట్టునని, సర్వస్వం తనకే చెందాలని స్వార్థభావన ఉండకూడదు. అలా కరడు గట్టిన స్వార్థంవల్ల త్యాగబుద్ధి నశిస్తుంది. తనంతట తాను ఇవ్వక పోగా అవసరంలో ఉన్న ఆర్తులెవరైనా అడిగితే వాళ్లను అసహ్యించుకొంటాడు. విధిలేక వాళ్లకేదైనా విదిలించాల్సివస్తే విపరీతంగా ఉంటుంది అతని ధోరణి. ముఖ్యంగా ముఖంలో ఆ తిరస్కార భావం తిష్ఠవేస్తుంది. అలా దానం ఇచ్చే కంటే మానడమే మంచిది. ఇచ్చినా అది నెమ్మదిగా దాతను సర్వ నాశనం చేస్తుందే గాని, సముద్ధరించడానికి సహాయపడదు. అందుకనే ఒళ్లు దగ్గఱ పెట్టుకొని వినయ విధేయతలతో తనకు దానంచేసే అవకాశం రావడం గొప్ప భాగ్యంగా భావిస్తూ చేయడం మంచిది.

8. ప్రజారక్షణ కోసం ఏ పనైనా చేయాలి:

నృశంస మనృశంసం వా ప్రజారక్షణ కారణాత్।
పాతకం వా సదోషం వా కర్తవ్యం రక్షతా సదా॥
రాజ్యభార నియుక్తానామేష ధర్మః సనాతనః॥ 25-18

ప్రజలను రక్షించడానికి కఠినమైన పనిగాని, మృదువైన పనిగాని, పాతకం చుట్టుకొనేదిగాని, దోషభూయిష్ఠమైన కార్యంగాని-అది ఎలాంటిదైనా రాజు తన కర్తవ్యంగా భావించి చేసి తీరాలి. రాజ్య భారాన్ని నిర్వహించే వాళ్లకు ఇదే సనాతనమైన ధర్మం.

ఏ ఆపదలు రాకుండా అహర్నిశం ప్రజలను కాపాడటం పరిపాలకుని ప్రథమ కర్తవ్యం. తన కర్తవ్య నిర్వహణలో ఒకప్పుడు అతడు కఠినంగాను, ఇంకొకప్పుడు దాక్షిణ్యంతోను నడవవలసి వస్తుంది. అంతేగాదు; పాపాలు నెత్తికి చుట్టుకొనే పాడు పనులు కూడా చేయవలసివస్తుంది. తన కర్తవ్యాన్ని

క్రమశిక్షణతో ఆచరించే రాజు ఎలాంటి పనినైనా ఆలోచించుకోకుండా 'ఇది నా కర్తవ్యం' అనే భావంతో చేసి తీరాలి. ఉద్దేశ్యం మంచిదైనప్పుడు భయపడి పారిపోనక్కరలేదు. రాజ్య పరిపాలన భారాన్ని బుజాన వేసుకున్న రాజు అలా చేయడమే ధర్మం. ఇదే పరంపరగా వస్తున్న సనాతన ధర్మం కూడా.

# అయోధ్యాకాండ

**9. వ్యసనాలకు బానిస కాకు :**

**భూయో వినయమాస్థాయ భవ నిత్యం జితేన్ద్రియః।**
**కామక్రోధసముత్థాని త్యజేథా వ్యసనాని చ॥** 3-42

అహంకారం కడుతున్న అడ్డుగోడల్ని వినయంతో తొలగించుకుంటూ, చపలత్వం ఉన్న ఇంద్రియాలను క్రమంగా చెప్పుచేతల్లో పెట్టుకుంటూ జయించాలి. కామక్రోధాలవల్ల కలిగే వ్యసనాల నన్నింటినీ పరిత్యజించాలి.

మానవుడికి అహంకారం అజన్మసిద్ధం. అహంకారం లేనివాణ్ణి చూసి ఆశ్చర్యపడాలి ఈ సమాజంలో. దానివల్లనే వ్యక్తికి, సమాజానికి ఎన్నో అనర్థాలు సంభవిస్తున్నాయి. హద్దులు మీరనంతవరకు, ఆత్మ విశ్వాసపు స్థాయిలో ఉన్నంతవరకు, జీవనగమనంలో అహంకారం ఉత్సాహాన్ని పెంపొందించే మాట వాస్తవమే. కాని హద్దులు మీరి దురహంకారమైతే వ్యక్తి చెడతాడు, సమాజమూ చెడుతుంది. అందువల్ల అహంకారం అదుపులోకి రావాలంటే వినయం ఒక్కటే విరుగుడు. వినయం పెరిగితే విశాలమైన విశ్వమానవతాదృక్పథం విస్తరిస్తుంది. దానివల్ల ఈ మహావిశ్వంలో తన తక్కువస్థాయి అర్థమవుతుంది. అది విరక్తికి బీజమై, ఇంద్రియనిగ్రహం, మనోనిగ్రహం కలుగుతాయి. మనస్సు మనం చెప్పినమాట వింటే కామక్రోధాల ప్రభావం దానిపైన పడదు. వాటి ప్రభావం లేని మనస్సును వ్యసనాలు వశపరచుకోలేవు. ఇది క్రమంగా అభ్యాసం ద్వారా సాధించుకోవలసిందే గాని హఠాత్తుగా సంభవించే మార్పు కాదు.

**10. ప్రజల ప్రమోదమే ప్రభువుకు రక్ష :**

**తుష్టానురక్తప్రకృతిర్యః పాలయతి మేదినీమ్।**
**తస్య నందంతి మిత్రాణి లబ్ధ్వాఽమృతమివామరాః॥** 3-45

రాజు తన ప్రజలను తృప్తిపరచి, వారి ప్రేమానురాగాలను అనుభవిస్తూ

పరిపాలన చేయాలి. అలాంటి ప్రభువును చూచి అతని మిత్రులు, అమృతలాభం వల్ల అమరుల్లాగా ఆనందపరవశు లౌతారు.

ప్రజానురంజనం చేయడమే ప్రభువుకు ప్రథమ కర్తవ్యం. రాజ్యంలో ప్రజలు ఎంత తృప్తిగా ఉంటే ఆ పరిపాలన అంత బాగుందని చెప్పవచ్చు. పరిపాలనలో తృప్తి ననుభవిస్తున్న ప్రజలు, తమను కంటికి రెప్పలాగా కాపాడే ప్రభువు మీద అనురాగవృష్టిని కురిపిస్తారు. అతను పదికాలాలపాటు చల్లగా ఉండాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తారు. ఆ రాజును చూచి అతని సన్నిహితులు అమృతాన్ని పొందిన అమరుల్లాగా ఆనందవీచికల్లో తేలియాడుతారు. అంతః కలహాలకు ఆస్కారం లేదు కాబట్టి రాష్ట్రం పటిష్ఠంగా ఉంటుంది. రాష్ట్రం శక్తిమంతంగా ఉంటే శత్రురాజులు రాజ్యాన్ని ఏమీ చేయలేరు. కనుక బాహ్యోపద్రవాలుండే అవకాశం లేదు. అందువల్ల ప్రజానురంజనానికి ప్రభువు ప్రయత్నించాలి. అదే రాజుకు, రాజ్యానికి కూడా శ్రీరామరక్ష.

**11. బుద్ధి చంచలమైంది :**

**చలం హి ప్రాణినాం మతిః।** 4-20

మానవుల బుద్ధి మఱీ చంచలమైంది.

మానవుడి మనస్తత్త్వం మఱీ చంచలమైంది. సహజంగా దానికంటూ ఏ కట్టుబాట్లూ లేవు. గాలి ఎటువీస్తే అటు పరుగెడుతుంది. చెప్పినమాట విన్నట్లే విని మళ్ళా అంతలోనే అనుకోని మార్పులకు గురి అవుతుంది. తీసుకున్న నిర్ణయాలు వాటి దోవన అవి పోతాయి. చేసుకున్న బాసలు చెప్పీ చెప్పకుండానే పలాయనం చిత్తగిస్తాయి. తనకు తనమీద గాని, ఇతరుల మీదగాని విశ్వాసం లోపిస్తుంది. అందుకే ప్రయత్న పూర్వకంగా సాధనతో మనస్సును మన స్వాధీనంలో పెట్టుకోవాలి. అప్పుడే బుద్ధులు సరైనవి పుడతాయి. స్థిరంగా నిలబడతాయి.

**12. మారిపోయే మనస్సు :**

**కిం తు చిత్తం మనుష్యాణా మనిత్య మితి మే మతిః**
**సతాం తు ధర్మనిత్యానాం కృతశోభి చ (రాఘవ)॥** 4-27

మానవుల మనస్సు ఎప్పుడూ మారిపోతూనే ఉంటుంది. పారిపోతూనే ఉంటుంది. ధర్మమార్గంలో నడిచే ధార్మికుల్లో మాత్రమే అది సుస్థిరంగా నిలబడి ప్రకాశిస్తుంది.

మానవుల మనస్సు క్షణక్షణానికి మారిపోతూనే ఉంటుంది. పట్టి కట్టేసినా నిలబడేది కాదు. గాలిని పట్టడం ఎంత కష్టమో దాన్ని పట్టడం కూడ అంత కష్టం. సాధన చేస్తేగాని దాన్ని పట్టుకోవడానికి వీలుపడదు. అందుకే మనవాళ్లు మనో నిగ్రహం ఎంతో ముఖ్యమని, దానికోసం ఎన్నో రకాల సాధనలను ఉపదేశించారు. అభ్యాసం చేయగా చేయగా అది ఒకనాటికి చిక్కి తీరుతుంది. ధర్మ మార్గంలో జీవనాన్ని సాగించేవాళ్లు కొద్ది కొద్దిగా దాన్ని వశపరచుకోవడానికి వీలవుతుంది. అందుకే వాళ్ల నిర్ణయాలు లోక కల్యాణాన్ని సాధించ గలుగుతాయి. వాళ్ల భావనలు భవ్యంగా రూపొందుతాయి.

**13. గతజల సేతుబంధనం :**

**గతోదకే సేతుబంధో న (కల్యాణి) విధీయతే॥ 9-52**

నీళ్లుంటే వాటిని దాటడానికి అడ్డంగా వారధి కడతారు. నీళ్లన్నీ పోయిన తరువాత ఎవ్వరూ వారధి కట్టాలని ప్రయత్నించరు.

సమస్య ఎదురైనప్పుడు వెంటనే దానికి సరైన పరిష్కారం ఏమిటని ఆలోచించాలి. పరిష్కార మార్గం దొరికిన వెంటనే ఆ సమస్యను పరిష్కరించుకోవాలి. అంతేగాని; సమస్య ఉద్భవించడం, సవ్యంగానో అపసవ్యంగానో అది సమసిపోవడం కూడా జరిగిన తరువాత దాన్ని మళ్లా తిరగతోడుకొని 'నేనైతే ఇలా చేసేవాడిని' 'అలా చేసే వాడిని' అని మాట్లాడకూడదు. అలా జరిగినప్పుడే ఈ మాటను చెబుతుంటారు. నీళ్లన్నీ పోయిన తరువాత అడ్డుకట్ట కట్టాలని ప్రయత్నించడం ఎంత అవివేకమో; అయిపోయినదాన్నిగురించి కోలాహలం చేయడం కూడా అంతే. అంటే; తగిన సమయంలో ఏ పనైనా చేయడం సబబు గాని ఎప్పుడో జరిగిపోయినదాన్ని గురించి ఇప్పుడు విచారించడం ఔచిత్యం అనిపించుకోదు.

**14. సత్యంతో లోకాన్ని జయించు :**

**సత్యేన లోకాన్ జయతి దీనాన్ దానేన (రాఘవః)।**

**గురూన్ శుశ్రూషయా వీరో ధనుషా యుధి శాత్రవాన్॥ 12-28**

శ్రీరామచంద్రుడు సత్యంతో లోకాలను, దానంతో దీనులను, సేవలతో గురువులను, ధనస్సుతో యుద్ధంలో శత్రువులను జయించేవాడు.

నీవు సత్యమే పలుకుతావనే నమ్మకముంటే చుట్టూ ఉండే సమాజం నిన్ను మనసారా గౌరవిస్తుంది. అవసరమైనప్పుడల్లా కావలసింది ఇస్తూ దీనులను

ఆదుకుంటుంటే వాళ్లు కృతజ్ఞతతో నీకు విధేయులై ఉంటారు. గురువుల నెప్పుడూ భక్తితో సేవిస్తూ ఉంటే, వాళ్లు మంచి మనస్సుతో నిన్నెప్పుడు ఆశీర్వదిస్తారు. యుద్ధరంగంలో పరాక్రమించి శత్రువులపై శరపరంపర కురిపిస్తే వాళ్ళు నీకు లొంగిపోతారు. అందువల్ల సత్యం, దానం, సేవ, పరాక్రమం అనే నాల్గు గుణాలు శ్రీరామచంద్రునిలాగా నీలోనూ ఎప్పుడూ ఉండాలి.

**15 మనకూ ఈ గుణాలు కావాలి :**

> సత్యం దానం తపస్త్యాగో మిత్రతా శౌచమార్జవమ్।
> విద్యా చ గురుశుశ్రూషా ధ్రువాణ్యేతాని (రాఘవే)॥ 12-29

సత్యం, దానం, తపస్సు, త్యాగం, స్నేహం, పరిశుభ్రత, ఋజు స్వభావం, విద్య, గురు శుశ్రూష అనే సద్గుణాలు రఘునాథునిలో స్థిరంగా ఉండేవి.

ఉదాత్త స్వభావులు, ఉత్తములైన పురుషులలో ఇలాంటి లోక కల్యాణ గుణాలున్నట్లు మనకు చరిత్ర చెపుతున్నది. దానిద్వారా మనం నేర్చుకోవాల్సిన పాఠాలివి. మానవుల్లో ప్రతివాడు ఒక ఉత్తమ వ్యక్తిగా, ఒక గొప్ప సంస్కృతికి వారసుడైన ఉత్తమ సామాజికుడుగా రూపొందాలంటే మనకు కల్యాణరాముడొక కమనీయమైన ఉదాహరణ కావాలి. వ్యక్తిగత స్వార్థాన్ని, సౌఖ్యాన్ని లెక్క చేయకుండా సమాజ సౌఖ్యం కోసం, వంశ ప్రతిష్ఠ కోసం సర్వస్వాన్ని త్యాగం చేసిన మహా త్యాగమూర్తి శ్రీరామచంద్రమూర్తి. భారతజాతి మొత్తం ఆయన అడుగుజాడల్లో నడిచింది. మనం నిజంగా మానవతావాదులమైతే; వ్యక్తి కంటే సమాజమే మనకు ముఖ్యమైతే, మనకూ ఈ గుణాలు కావాలి.

**16. సత్యమంటే ఏమిటో తెలుసా ?**

> సత్య మేకపదం బ్రహ్మ సత్యే ధర్మః ప్రతిష్ఠితః।
> సత్యమేవాక్షయా వేదాః సత్యేనైవాప్యతే పరమ్॥ 14-7

సత్యమొక్కటే భగవంతునికి చక్కని నివాసం. ధర్మం సత్యంలోనే స్థిరంగా ఉంది. జ్ఞాన విజ్ఞానాలకు విలాసాలైన వేదాలు సత్యస్వరూపాలే. మనం సముత్కృష్టస్థానాన్ని పొందడానికి సత్యమొక్కటే రాజమార్గం.

సత్పురుషులు మాట్లాడే సత్యమైన వాక్కులోనే భగవంతుడు నిండి ఉన్నాడు. సత్యాన్ని వదిలి సర్వేశ్వరుడు ఉండడు. సర్వేశ్వరుణ్ణి వదిలి సత్యమూ ఉండదు. ఎందుకంటే; భగవాన్ సత్యస్వరూపి. ఆయనే సత్యనారాయణుడు.

సత్యమే ఆయన. 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అని కదా శ్రుతి! ఎక్కడ సత్యానుశీలనం జరుగుతుంటుందో అక్కడే ధర్మం ఉంటుంది. ధర్మవ్యవస్థాపనం చేయడం కోసమే గదా, సత్యస్వరూపి భగవాన్ అవతరించడం, శాశ్వత శబ్ద రాసులైన వేదాలు సత్యవ్యవస్థాపనం చేస్తున్నాయి. కాబట్టి అవి కూడా సత్య స్వరూపాలే. సత్యసంసేవనం చేసినవాడికే ఉత్తమలోక ప్రాప్తి కలుగుతుంది.

**17. తల్లిదండ్రుల సేవకు సాటిలేదు :**

న హ్యతో ధర్మచరణం కించిదస్తి మహత్తరమ్।
యథా పితరి శుశ్రూషా తస్యవా వచనక్రియా॥ 19-22

ఈ లోకంలో తల్లిదండ్రుల సేవ చేయడం, వాళ్ల చెప్పిన మాట వినడం కంటే పిల్లలు వేఱే ధర్మాన్ని ఆచరించాల్సిన పనిలేదు.

'మాతృదేవో భవ' 'పితృదేవో భవ' అంటోంది ఆమ్నాయం. ఆకారమే లేని ఆత్మకు కరచరణాద్యవయవాలతో శరీరమనే ఒక ఆశ్రయాన్ని కల్పించిన వాళ్ళు తల్లిదండ్రులు. తల్లిదండ్రులే లేకపోతే పిల్లవాడెక్కడుంటాడు? కనుక ప్రత్యక్ష దైవాలైన తల్లిదండ్రులను నిత్యమూ సేవించాలి. అదే పిల్లలకు ప్రథమ కర్తవ్యం. మనం ఎన్ని ధర్మకార్యాల నాచరించినా అవి తల్లిదండ్రులకు సేవ చేసినంత గొప్పపనులు కావు. అలాగే వాళ్ళు చెప్పిన మాటను తు. చ. తప్ప కుండా పాటించడం కూడా తప్పనిసరి. జన్మనిచ్చిన తల్లిదండ్రుల మాటలను పిల్లలే లెక్కపెట్టకపోతే, ఇక ఈ సమాజంలో వాళ్ల మాటలను ఇతరు లెందుకు గౌరవించాలి? కాబట్టి తల్లిదండ్రులను సేవించడం, వాళ్ళు చెప్పే మంచిమాటలను పాటించడం మనవిధి.

**18. తండ్రినైనా శాసించాల్సిందే !**

గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః।
ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్॥ 21-13

గర్వాంధకారంలో మంచి చెడ్డలు తెలుసుకోకుండా పెడదోవన పోయే పెద్దవాళ్లను కూడా సరైన దోవకు రమ్మని శాసించడం తప్పు కానేకాదు.

గురువంటే పెద్ద అని అర్థం, అది కన్నతండ్రి కావచ్చు లేక కన్నులు తెరిపించి విజ్ఞానజ్యోతిని వెలిగించిన ఉపాధ్యాయుడు కావచ్చు. విధివశాత్తు వీళ్లిద్దఱిలో ఎవరైనా సరే, సరైన దోవన నడవకపోతే; ఆ విషయంలో సాక్ష్యాధారా లుంటే; వాళ్ళను బలవంతంగానైనా మంచిదోవలో పెట్టాల్సిన అవసరం ఉంది.

మనకేంలే అని పట్టించుకోకుండా వదిలెయ్యకూడదు. పెద్దవాళ్ళు కూడా 'బాలాదపి సుభాషితమ్' అన్నట్టు పట్టుదలకు పోకుండా పసివాళ్ళనుంచైనా మంచిమాటలను స్వీకరించాలి. అవ్యవస్థను వ్యవస్థ. అధర్మాన్ని ధర్మం ఎదుర్కోవడం, సమాజంలో నైతిక విలువలను కాపాడటంకోసమేగాని వ్యక్తిగతమైన రాగద్వేషాలకు ఇక్కడ ఏమాత్రం అవకాశముండకూడదు.

**19 అదృష్టంవల్లనే అన్నీ ఏర్పడతాయి :**

**సుఖదుఃఖే భయక్రోధౌ లాభాలాభౌ భవాభవౌ।**

**యచ్చ కించిత్తథాభూతం నను దైవస్య కర్మతత్॥ 22-22**

సుఖం, దుఃఖం, భయం, క్రోధం లాభం, నష్టం, జన్మ, జన్మరాహిత్యం, ఇలాంటివన్నీ మానవుడికి అదృష్టాధీనాలు.

అదృష్టం అంటే కనపడనిదని అర్థం. భౌతికమైన కారణాలు స్పష్టంగా కంటికి కనపడతాయి. అలా కంటికి కనపడకుండా కార్యాలను క్రమంగా జరిపించేది కాబట్టి ప్రారబ్ధం మొ॥ కర్మలకు అదృష్టమని పేరు. ఈ జీవితంలో అనుభవించే అన్ని సుఖదుఃఖాలు, భయక్రోధాలు, లాభనష్టాలు, పుట్టడం పుట్టకపోవడం, ఇలాంటివన్నీ అదృష్టంవల్లనే మనకు అందుబాటులోకి వస్తుంటాయి. కాబట్టి భౌతిక దృష్టితో మనకు కలిగే సుఖానికి ఎవళ్లో కారణమని భ్రమపడి వాళ్ళను పొగడటం, కష్టం కలిగినప్పుడు వీళ్ళవల్లనే కలిగిందని కొందరిని అదేపనిగా తెగడటం అజ్ఞానంవల్లనే. వెనుకటి జన్మల్లో మనం చేసుకొచ్చిన 'ప్రారబ్ధ' మనే అదృష్టం ఈ ఫలితాలనన్నింటిని ఈ జన్మలో మనకిస్తుంటుంది. ఈ భావన మన దైనందిన వ్యవహారాల్లో కలిగితే రాగద్వేషాలను జయించడానికి వీలవుతుంది.

**20. నియమాలు తప్పితే నిలబడటం కష్టం :**

**ఋషయోఽప్యుగ్రతపసో దైవేనాభిప్రపీడితాః।**

**ఉత్సృజ్య నియమాంస్తీవ్రాన్ భ్రశ్యన్తే కామమన్యుభిః॥22-23**

గొప్ప తపస్సంపన్నులైన ఋషులు కూడా విధి వక్రించినప్పుడు నియమనిష్ఠలను కోల్పోయి కామక్రోధాలకు కట్టుబడి, కాలగర్భంలో కలిసిపోయారు.

మనమెంత క్రమశిక్షణతో ఉన్నా ఒకప్పుడు విధివిలాసం విచిత్రంగా ఉంటుంది. తీవ్రమైన నియమాలను కూడా తెలియకుండానే తేలికగా ఉల్లంఘిస్తాం. నియమనిష్ఠలు లేనివాణ్ణి కామక్రోధాలు కనుసన్నలతో వశపరచుకుంటాయి. ఇంతకు పూర్వం ఎంత జ్ఞాని అయినా, ఎంతటి తపస్సంపన్నుడైనా కామక్రోధ ప్రవా

హంలో కన్నుమిన్ను కానకుండా ప్రవర్తిస్తారు. పతనావస్థ ప్రారంభమౌతుంది. వినయం, వివేకం, విచక్షణ మంటగలిసిపోతాయి. చివరకు వ్యక్తిత్వమే శూన్యమై సర్వనాశనం సంభవిస్తుంది. అందుకే జాతి శాశ్వతంగా నిలబడాలంటే ప్రతివాడు కనీసపు నియమాలను కడదాకా పాటించాలి. అప్పుడే దేశం ప్రగతిపథంలో పయనించగలుగుతుంది.

**21.** దైవప్రభావాన్ని ఎవరూ గుర్తించలేరు :

**అసంకల్పితమేవేహ యదకస్మాత్ప్రవర్తతే।**
**నివర్త్యారంభమారబ్ధం నను దైవస్య కర్మతత్॥** 22-24

మన సంకల్పాలకు అతీతంగా అనుకోకుండా ప్రారంభించిన పనులు ఆగిపోయి వేతే మలుపు తిరుగుతుంటాయి. అదే దైవప్రభావం.

మనం చేస్తున్న పనులన్నీ మన సంకల్పాల వల్లనే జరుగుతున్నాయని భ్రమపడుతుంటాం. మన సంకల్పాలకు దైవ సంకల్పం తోడున్నంత వరకు ఆ భ్రమ అలాగే కొనసాగుతూ ఉంటుంది. కాని ఉన్నట్టుండి ఒకప్పుడు కథ అడ్డం తిరుగుతుంది. ప్రారంభించిన పనులు ఆగిపోవడం, ఎంత ప్రయత్నించినా ఎదురొచ్చిన విఘ్నాలు వెనక్కు వెళ్ళకపోవడం జరుగుతుంది. అప్పుడే మనకు జ్ఞానోదయం కావాలి. ఏమైంది మన ఆలోచన? ఎక్కడికి పోయింది మన అహంకారం? మన కళ్లు తెరిపించడానికే భగవంతుడు చిన్న పరీక్ష పెడతాడు. వివేకం ఏర్పడి అందులో నెగ్గితే, ఇక అలాంటి పరీక్షలుండవు. విరోధం పెంచుకొని అజ్ఞానంలో మునిగిపోతే మళ్లా మళ్లా అలాంటి పరీక్షలు ఎదుర్కోక తప్పదు. అందువల్లనే దైవప్రభావం ఎవరి మీద ఎప్పుడు ఎలా ప్రసరిస్తుందో ఎవరూ చెప్పలేరు. అది అంత తేలికగా అర్థమయ్యే అంశం కాదు.

**22.** **ప్రయత్నించు ! విధిని ప్రతిఘటించు !**

**దైవం పురుషకారేణ యః సమర్థః ప్రబాధితుమ్।**
**న దైవేన విపన్నార్థః పురుషః సోఽవసీదతి॥** 23-17

ఉత్సాహాన్ని పుంజుకొని అన్ని శక్తులను కూడగట్టుకొని అదృష్టాన్ని మార్చివేయడానికి ప్రతివాడు ప్రయత్నించాలి. అలా తన కర్తవ్యంలో లోటు లేకుండా ప్రయత్నిస్తే అదృష్టం కూడా అనుకూలిస్తుంది. కార్యనాశం కలగకుండా ఉంటుంది.

మానవప్రయత్నం అదృష్టాన్ని మార్చగలదా? మార్చలేదా? అనేది ప్రశ్న. తప్పకుండా మార్చగలదనే సమాధానం. అయితే, అహంకారంతో కాకుండా అణకువతోను, స్వార్థంతో కాకుండా, నిస్స్వార్థంగాను, భగవంతునిపై ఆగ్రహంతో కాకుండా భగవదనుగ్రహాన్ని కోరుతూను ప్రయత్నం ప్రారంభం కావాలి. అప్పుడు జరగవలసినదాన్ని తప్పించి మన ప్రయత్న పరమార్థాన్ని గుర్తించి, దైవమే మనకు అనుకూలంగా పరిణమిస్తుంది. తలపెట్టిన పని ముందు తల్లకిందులైనా తరువాత సక్రమంగా పూర్తవుతుంది. అందువల్ల నిరుత్సాహపడకుండా నిరహంకారంగా ప్రయత్నం చేయాలి.

**23. పతియే ప్రత్యక్షదైవం :**

**జీవన్త్యా హి స్త్రియో భర్తా దైవతం ప్రభురేవ చ। 24-21**

**భర్తా తు ఖలు నారీణాం గుణవాన్నిర్గుణోఽపి వా।**

**ధర్మం విమృశమానానాం ప్రత్యక్షం దేవి దైవతమ్॥ 62-8**

ధర్మ విచారణ చేస్తే భర్త గుణవంతుడైనా కాకపోయినా స్త్రీలకు జీవితాంతం అతడే దైవం, అతడే ప్రభువు.

సతికి పతియే ప్రత్యక్షదైవం. అంతమాత్రమే కాదు; స్త్రీ జీవితంలోని మంచి చెడ్డలన్నింటిని గమనించి, ఏ లోటూ రాకుండా చల్లగా కాపాడి జీవన జ్యోతిని వెలిగించే ప్రభువు కూడా అతడే. అందుకే అంటారు– "ఆడదానికి భర్త రాజ్యం స్వరాజ్యం. పిల్లలరాజ్యం పరాయిరాజ్యం" అని. అతడు గుణవంతుడు కాకపోవచ్చు, దుర్మార్గుడే కావచ్చు. కాని ధార్మిక దృష్టితో చూస్తే ఆమె అతణ్ణే దైవంగా ఆరాధించాలి. కనుక స్త్రీజాతి తాత్కాలికమైన పట్టుదలలను, ప్రయోజనాలను లెక్కచేయకుండా భర్తను దైవంగా ఆరాధిస్తే ఆయన అనురాగానికి పాత్రమై, జీవితాన్ని ఆనందమయం చేసుకోగలుగుతుంది.

**24. భర్తను ధిక్కరించి బాగుపడటం కష్టం :**

**వ్రతోపవాసనిరతా యా నారీ పరమోత్తమా।**

**భర్తారం నానువర్తేత సా తు పాపగతిర్భవేత్॥ 24-25**

ఎంత ఉత్తమురాలైనా, ఎన్నో వ్రతాలను ఉపవాసాలను ఆచరించేదైనా భర్తననుసరించి నడవని భార్య మంచిని పొందలేదు.

కొందరు స్త్రీలు కోట్లకొలది వ్రతాలు చేస్తూనే ఉంటారు. ఉపవాసాలు సరేసరి. నిజంగా వాళ్ళు ఎంతో మంచివాళ్ళు కూడా. కాని ఏం ప్రయోజనం? భర్త

మాట మీద గౌరవం లేదు. ఆయన చెప్పుచేతల్లో ఉండటం వారికెంతో కష్టం. 'మాకు ఆ మాత్రం స్వాతంత్ర్యం లేదా?' అంటారు. అలాంటివాళ్ళ వ్రతాలు, ఉపవాసాలు, దానాలు, ధర్మాలు బూడిదలో పోసిన పన్నీరే అవుతాయి వాళ్ళకు ఉత్తమలోక ప్రాప్తి ఉత్తుత్తిదే అవుతుంది. నిజానికి భర్తను గౌరవిస్తూ, సంసారాన్ని సరిదిద్దుకుంటూ జీవితాన్ని ఆనందంగా గడపగలిగే ఆడవాళ్ళు ఎంతో అదృష్టవంతులు.

**25 దేవుణ్ణి పూజించకపోయినా ...**

> **భర్తుః శుశ్రూషయా నారీ లభతే స్వర్గముత్తమమ్।**
> **అపి యా నిర్నమస్కారా నివృత్తా దేవపూజనాత్॥ 24-26**

తను నిత్యం దేవపూజ చేయకపోయినా, తనను సమాజంలో ఎవరూ గౌరవించకపోయినా, భర్తను సేవించే స్త్రీ స్వర్గాన్ని పొందుతుంది.

ఆడవాళ్లకు కొందఱికి ఇంట్లోను, దేవాలయాల్లోను ఎప్పుడూ పూజలు చేయడం, చేయించడం పరిపాటి. అలాగే సమాజంలో కూడా వారెంతో గౌరవ స్థానంలో ఉంటారు. కానీ భర్త అలసిపోయి ఇంటికివస్తే అతనికి సేవ చేయాలంటే వాళ్లకు తీరిక, ఇష్టం రెండూ ఉండవు "నాకే విశ్రాంతి లేదు; ఇంక మీకేం సేవ చేస్తాను" అంటారు. భగవంతుని సేవకు, సమాజ సేవకు అంకితమైన ఆ సాధ్వీమతల్లిని చూసి అవాక్కయిపోతాడు పాపం, అనాథుడైన ఆ నాథుడు. ఇది అభినందించతగిన విషయంకాదు. ఇల్లాలికి ప్రథమ కర్తవ్యం-భర్తకు సేవ చేయడం, కుటుంబాన్ని సరిదిద్దుకోవడం. తానెన్ని పూజలైనా చేయచ్చు; సమాజంలో తనకెంతమందైనా బ్రహ్మరథం పట్టవచ్చు. కానీ తన కర్తవ్యాన్ని మాత్రం ఆమె విస్మరించకూడదు. 'కార్యేషు దాసీ' అని కదా ధర్మపత్ని లక్షణం!

**26. రాజానుగ్రహం ఎలా పొందడం?**

> **ఆరాధితా హి శీలేన ప్రయత్నైశ్చోపసేవితాః।**
> **రాజానః సంప్రసీదన్తి ప్రకుప్యన్తి విపర్యయే॥ 26-35**

మంచి స్వభావంతో సమయానుకూలమైన ప్రయత్నాలతో అధిపతులను ఆరాధించాలి, సేవించాలి. అప్పుడు వాళ్ళు ప్రసన్నులై మన కోర్కెలను తీరుస్తారు. దీనికి విరుద్ధంగా మనం నడిస్తే వాళ్ళుకూడా అగ్రహోదగ్రులౌతారు.

రాజానుగ్రహాన్ని సంపాదించడం అంత తేలికైన పనికాదు. మన

స్వభావం సరళమైనదనే నమ్మకం రాజుకు కలగాలి. అలాంటి నమ్మకం మన మీద కలిగేదాకా విశ్వాసపూర్వకంగా ఆయనను ఆరాధించాలి. సమయసందర్భాల కోసం ఎదురుచూసి అవకాశం దొరికినప్పుడు ఆయనకు సేవల నందించాలి. అప్పుడు ప్రభువు ప్రసన్నుడై అనుగ్రహవృష్టిని కురిపిస్తాడు. అలా కాకుండా రాజుకు, రాజ బంధువులకు ఇష్టంలేని మార్గంలో నడిచినా, వాళ్ల విషయంలో అవినయాన్ని ప్రదర్శించినా ఫలితం చాలా తీవ్రంగా ఉంటుంది. రాజాగ్రహానికి గురి కావలసి వస్తుంది.

**27. భర్త అదృష్టానికి భార్యే వారసురాలు :**

**ఆర్యపుత్రః పితా మాతా భ్రాతా పుత్రస్తథా స్నుషా।**
**స్వాని పుణ్యాని భుంజానాః స్వం స్వం భాగ్యముపాసతే॥**
**భర్తుర్భాగ్యం తు భార్యైకా ప్రాప్నోతి పురుషర్షభ। 27-4**

తల్లి, తండ్రి, సోదరుడు, కుమారుడు, కోడలు మొ॥ వాళ్ళు తమ తమ అదృష్టంవల్ల కలిగే సుఖదుఃఖాలను అనుభవిస్తూంటారు. కాని తన భర్త అదృష్టాన్ని భార్య ఒక్కతే అనుభవించగలుగుతుంది.

మానవుడికి తల్లి, తండ్రి, అన్నదమ్ములు, కొడుకులు, కోడళ్ళు, కూతుళ్ళు, అల్లుళ్లు మొ॥ వాళ్ళతో ఉండే సంబంధానికి అర్ధాంగితో ఉండే సంబంధానికి యెంతో తేడా ఉంది. మనస్సులో, శరీరంలో, మంచి చెడ్డల్లో అర్ధభాగంగా జీవితాంతం ఉంటూ స్త్రీ పురుషుడికి అర్ధాంగి అవుతున్నది. అంతేకాకుండా ఇతడి అదృష్టాన్ని కూడా పంచుకొనే వారసురాలు భార్య మాత్రమే. మిగతా వాళ్లంతా వాళ్ళ వాళ్ళ అదృష్టాన్ని బట్టే సుఖాన్నో దుఃఖాన్నో అనుభవిస్తూ ఉంటే; ధర్మపత్ని మాత్రం భర్త అదృష్టాన్ని పంచుకొని కష్టాన్నైనా, సుఖాన్నైనా అనుభవిస్తుంది. అందుకే భారతీయ ధర్మశాస్త్రాలు భార్యాభర్తల సంబంధం ఏడు జన్మల బంధమని అభివర్ణిస్తున్నాయి.

**28. సతికి పతే గతి :**

**న పితా నాత్మజో నాత్మా న మాతా న సఖీజనః।**
**ఇహ ప్రేత్య చ నారీణాం పతిరేకో గతిస్సదా॥ 27-5**

భారతీయ మహిళ ఈ లోకంలోగాని పరలోకంలో గాని తండ్రి, తల్లి, కొడుకులు, స్నేహితులు మొ॥ వాళ్లెవ్వరిని ఆశ్రయించదు భర్త నొక్కడినే అనుగమిస్తుంది.

ఈ లోకంలో జీవించినంతకాలం గాని, పరలోకంలోగాని స్త్రీకి తల్లి దండ్రులు, కొడుకులు, స్నేహితులు మొ॥వాళ్ళు ఆలంబనం కామ. అగ్ని సాక్షిగా చేయి అందుకొన్న భర్త ఒక్కడే ఆమెకు ఆశ్రయించదగినవాడు. ఈ లోకంలోనే మిగతావాళ్లతో సంబంధం సరిగా ఉండదు. పరలోకాల్లో అసలు యెవరికీ ఇతరులతో సంబంధం లేదు కాని, భర్తతో కలిసిన బంధం ఈ లోకం లోను, ఇతర లోకాల్లో కూడా చాలా పవిత్రమైంది. శాశ్వతమైంది. అందువల్లే భారతీయులు వివాహబంధానికి అంతటి విశిష్టతను విశదీకరించారు.

**29 పెద్దల సేవకు పెద్దది ఫలితం :**

స్వర్గో ధనం వా ధాన్యం వా విద్యాపుత్రాః సుఖాని చ।
గురువృత్త్యనురోధేన న కించిదపి దుర్లభమ్॥ 30-36

పెద్దవాళ్లమాట విన్నవాళ్లకి స్వర్గం, ధనం, ధాన్యం, విద్య, సంతానం, సకల సుఖాలు- అన్నీ సులభంగా ఏర్పడతాయి.

"పెద్దవాళ్ల మాటలు వినటమా? ఛీ! ఛీ! బూజుపట్టిన భావాలు వాళ్లవి" అంటారు సోదరులు కొందరు. కానీ ఇక్కడ ఒక సత్యాన్ని వాళ్ళు గుర్తించరు. జీవితాన్ని కాచి వడగట్టిన పెద్దవాళ్ళ అనుభవం పరిపక్వమైనది. ఆ అనుభవాల నాకళించుకొని, వాళ్ళుపడ్డ కష్టాలు మనం పడకూడదని జాలితో, ప్రేమతో, వాళ్ళు మనకు చెప్పిన మాటలు మానవజాతికి వెలుగుబాటలు. వాళ్ళ జీవితాల బాటలు అనుభవాలు పండించిన పళ్ళతోటలు. వాటిని కాదనుకొనే వాళ్ళు భవిష్య త్తును కాలదన్నుకొనేవాళ్ళే. త్రికరణ శుద్ధిగా సేవిస్తూ వాళ్ళ అడుగుజాడల్లో నడిస్తే వాళ్ళమాటల్లో మంచిని చెవిలో వేసుకొంటే, మన జీవనయాత్ర సుగమ మౌతుంది. అంతేకాదు, ఈ లోకంలో మనకు కావలసిన ధన ధాన్యాలు, భోగ భాగ్యాలు, చదువు సంధ్యలు, మంచి కుటుంబం మొ॥ అన్నింటితోపాటు పరలోక ములో సకల సౌఖ్యాలు లభిస్తాయి అందుకే మనవాళ్ళు 'పెద్దల మాట చద్ది మూట' అంటారు.

**30. ఎవరు పురుషోత్తముడు?**

ఆనృశంస్యమనుక్రోశః శ్రుతం శీలం దమః శమః।
రాఘవం శోభయన్త్యేత్ షడ్గుణాః పురుషోత్తమమ్॥ 33-12

మృదుత్వం, దయ, జ్ఞానం, మంచి స్వభావం, ఇంద్రియ నిగ్రహం,

మనో నిగ్రహం అనే ఆరు గుణాలు పురుషోత్తముడైన రఘురాముణ్ణి శోభింప జేస్తున్నాయి.

శ్రీరామచంద్రుడిలో ఉన్న ఈ ఆరుగుణాలు ఆయన్ను పురుషోత్తముణ్ణి చేసినాయి. తోటివారు బాధల్లో ఉంటే హృదయం కరిగిపోవడం, బలహీనుల విషయంలో దయతో ఉండటం, అధ్యయనంద్వారా ఆర్జించిన పరిపూర్ణమైన జ్ఞానం, త్రికరణ శుద్ధివల్ల ఏర్పడ్డ సాధుస్వభావం, అభ్యాసంతో సంపాదించుకున్న బాహ్యేంద్రియ నిగ్రహం, మనో నిగ్రహం ఈ లక్షణాలు ఎవరు సాధిస్తే వాళ్ళే పురుషోత్తములౌతారు. ఇవేవీ లేకపోతే కాపురుషోత్తములౌతారు. నిండు మనిషిగా ఎదగాలంటే ఈ ఆరుగుణాలు కావాలి. అవతార పురుషులకు సహజముగా సిద్ధించినా, ఇవి అభ్యాసంచేస్తే అందరికీ అబ్బుతాయి. అభ్యాసంతో సాధించలేనిది ఏముంటుంది?

## 31. తండ్రినిబట్టి కొడుకు; తల్లినిబట్టి కూతురు :

**పితౄన్సమనుజాయన్తే నరా మాతరమంగనాః।** 35-26

మగపిల్లలు తండ్రి సంస్కారాలను, ఆడపిల్లలు తల్లి సంస్కారాలను వారసత్వంగా పొందుతారు.

లోకంలో సామాన్యంగా తల్లిదండ్రుల సంస్కారాలు, స్వభావాలు పిల్లలలో చూస్తుంటాం. శారీరకమైన పోలికలు అటు ఇటు ఉన్నా హెచ్చుగా తండ్రినుంచి కొడుకులకు, తల్లినుంచి కూతుళ్ళకు స్వభావాలు, సంస్కారాలు సంక్రమిస్తుంటాయి. మమకారంకూడా కొడుకులపైన తండ్రికి, కూతుళ్ళపైన తల్లికి హెచ్చుగా ఉంటుంది. సజాతీయత్వమే దానికి కారణం కావచ్చు అందుకే చాలా సందర్భాల్లో వంశాన్ని ప్రధానాంశంగా పరిశీలిస్తాం.

## 32. ఆడదానికి అంతా ఆత్రమే :

**ఏష స్వభావో నారీణామనుభూయ పురా సుఖమ్।**
**అల్పమప్యాపదం ప్రాప్య దుష్యన్తి ప్రజహత్యపి॥** 39-21

ఇదివరకు ఎన్ని సుఖాల ననుభవించినా, ఏదైనా ఒక ఆపద రావడంతోటే భర్తను దూషించడం, వదిలిపెట్టి వెళ్ళిపోవడం ఆడవాళ్ళకు సహజ స్వభావం.

ఆడదాని స్వభావాన్ని అర్థం చేసుకోవడం అజునికైనా, వాని తాతకైనా అశక్యమే నన్నారు పెద్దలు. సుఖంగా ఉన్నంతసేపు భర్తతో సుందర మంద

హాసం చేస్తారు. ఇంద్రుడిని చంద్రుడిని అంటారు. చిన్న కష్టం రావడంతోటే 'నన్ను పలుకరించకు' అంటారు. ఇదేమిటి అంటే అదంతేనని 'అసలు నా కర్మ' అంటూ ఆత్మనింద ఆరంభిస్తారు. అలా అలా అది పతిదేవుడిపైన పళ్ళు కొరకడం వరకూ వస్తుంది. అంతటితో ఆగక ఒకప్పుడు ఆలోచనారహితంగా అతణ్ణి వదలి వెళ్ళిపోవడం కూడా సంభవిస్తుంది. బంధుమిత్రులో తల్లిదండ్రులో తగినట్లు నచ్చచెప్పేదాకా ఆ ఆవేశం చల్లారదు. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొనే ప్రయత్నాలు అప్పుడు జరుగుతాయి ఇది చాలా మంది ఆడవాళ్ళల్లో కనపడే తొందరపాటు స్వభావం.

## 33. అతివల మనస్సు అతి చంచలం :

న కులం న కృతం విద్యా న దత్తం నాపి సంగ్రహమ్।
స్త్రీణాం గృహ్ణాతి హృదయం అనిత్యహృదయా హితాః॥39-23

ఆడవాళ్ళ హృదయం అతి చంచలమైనది. కులం, సాహాయ్యం, పాండిత్యం, పారితోషికాలు, చిట్టచివరకు వివాహబంధం కూడా వారి హృదయాన్ని కట్టి బంధించలేవు.

అతివల మనస్సు అతి సున్నితమైనది. చిటికితే నిలవదు. ఎంత గొప్ప కులంలో పుట్టినా, ఎంత ఆపదలో తనను కాపాడినా, ఎన్ని విద్యార్హతలున్నా, కోరిన బహుమతినల్లా తీసి ఇచ్చినా, అర్ధాంగిగా అంగీకరించి, గృహలక్ష్మిగా గౌరవించినా ఆడవాళ్ళ మనస్సును మగవాడు ఆకట్టుకోలేడు. ఎప్పుడు ఏ చాంచల్య మేర్పడుతుందో ఎవరికీ తెలియదు. అందుకే 'దేవో న జానాతి కుతో మనుష్యః?' అన్నారు పెద్దలు. దేవుడికే తెలియకపోతే మానవుడికెలా తెలుస్తుంది? అయినా మొండితనానికిపోక మగవాడే సర్దుకుపోవటం నేర్చుకోవాలి. భార్యాభర్తలు సహనంతో సర్దుకోవడంలోనే సంసార రహస్యం ఇమిడి ఉంది.

## 34. పందమంది కొడుకులున్నా ...

నా తన్త్రీ వాద్యతే వీణా నా చక్రో వర్తతే రథః
నా పతిః సుఖమేధేత యా స్యాదపి శతాత్మజా.

తీగలు లేకుండా వీణ మోగదు. చక్రాలు
పందమంది పిల్లలున్నా భర్త లేకుండా భార్య సు

వందమంది కొడుకులున్నా భర్తతోడులేని ఆడదాని జీవితంలో ఆనందం శూన్యం. తోడులేని ఆడదాని జీవితం మోడువారిన మొక్కలాంటిది. వీణ ఎంత అందంగా ఉన్నా తీగలు లేకపోతే ఎలా మధుర మంజులనాదాన్ని మన కందించ గలుగుతుంది? అలాగే స్త్రీకి ఎన్ని సిరిసంపదలున్నా, ఎన్నెన్ని అందచందా లున్నా, ఎంతమంది సంతానం ఉన్నా, సరైన భర్త లేకపోతే సుఖ సంతోషా లుండవు. నిజంగా ఆ జీవితానికి అర్థమే ప్రశ్నార్థకమౌతుంది. కనుక శక్తి వంచన లేకుండా భర్తను జీవిత సర్వస్వంగా కాపాడుకోవాలి.

**35. భర్త నెవరు పూజించరు?**

**మితం దదాతి హి పితామితం మాతా మితం సుతః।**
**అమితస్య హి దాతారం భర్తారం కా న పూజయేత్॥** 39-30

ఆడదానికి తల్లి, తండ్రి, కొడుకు మొ॥ వాళ్ళందించే ప్రేమాభిమానాలు చాలా మితమైనవే. భర్త ఇచ్చే ప్రేమాభిమానాలకు కొలతే లేదు. అలాంటి భర్తను ఏ స్త్రీ పూజించదు?

అమ్మాయిని ప్రేమతో పెంచి పెద్దచేస్తారు తల్లిదండ్రులు. ఒక అయ్య చేతిలో పెట్టి ఊరుకుంటారు. పెరిగిన తన కుటుంబాన్ని చూసుకుంటూ భార్య ఒప్పుకుంటే తల్లినికూడా అభిమానంతో పోషిస్తాడు కొడుకు. చిన్నతనంలో తల్లిదండ్రులు, పెద్దతనంలో తనయుడు ఎంతో ఆప్యాయత చూపిస్తారు. కాని, భర్త భార్య కిచ్చే ఆనందానికి, సుఖసంతోషాలకు, ప్రేమాభిమానాలకు కొలబద్దలు లేవు. వాటిముందు ఆమె తల్లిదండ్రులు, కుమారుడు అందించే అప్యాయతలు ఎంతో తక్కువైపోతాయి. అలా అమితమైన ప్రేమాభిమానాల నందించి ఆనందింపజేస్తూ జీవితానికి అర్థాన్ని, పరమార్థాన్ని కలిగించే భర్తను ఏ స్త్రీ పూజించదు? తప్పకుండా పూజిస్తుంది. భర్త అలాంటివాడు కాకపోతే ఏ స్త్రీ అయినా ఏం చేస్తుంది, పాపం! అందుకే జీవిత శకటం సరళంగా సమంగా నడవాలంటే భార్య భర్తలనే రెండు చక్రాలు అవగాహనతో అడుగు ముందుకు వేయాలి.

**36. శోకాన్ని మించిన శత్రువు లేదు:**

శోకో నాశయతే ధైర్యం శోకో నాశయతే శ్రుతమ్।
శోకో నాశయతే సర్వం నాస్తి శోకసమో రిపుః॥ 62-15

ధైర్యాన్ని, సంస్కారాన్ని, ఇది అది ఏమిటి? సమస్తాన్నీ దుఃఖం నాశనం చేస్తుంది. మనకు శోకంలో సమానమైన శత్రువే లేడు.

ఇంతకు పూర్వం అతడు ఎంతో ధైర్యం గలవాడు. ఎంతో జ్ఞానాన్ని సంపాదించుకున్నవాడు. కాని ఇప్పుడేమైంది? శోక సాగరంలో మునిగి అన్నీ పోగొట్టుకున్నాడు. పిరికివాడైపోయినాడు. అజ్ఞానిలాగా మాట్లాడుతున్నాడు. నిజంగా శత్రువుకూడా ఇంత హాని చేయలేదేమో! అందుకే అంటారు- శోకంతో సమానమైన శత్రువే లేదని, కాబట్టి లోకాన్ని చూస్తూ శోకాన్ని దూరంగా నెట్టి వేయాలి.

**37. చేసుకున్నవాడికి చేసుకున్నంత :**

> **యదాచరతి (కల్యాణి) శుభం వా యది వాఽశుభమ్।**
> **తదేవ లభతే భద్రం కర్తా కర్మజమాత్మనః॥** 63-6

మంచిగాని చెడుగాని పూర్వజన్మలో తను ఎలాంటి కర్మ చేస్తాడో, దానివల్ల కలిగే సుఖదుఃఖాలనే మానవు డిప్పుడు అనుభవిస్తున్నాడు.

చేసింది చేసినట్లు అనుభవించాల్సిందే. అనుభవంలోకి రాకపోతే కర్మ నశించదు. అందుకే అంటారు. ''నా భుక్తం క్షీయతే కర్మ'' అని ఇప్పుడు విఱ్ఱవీగవచ్చు."ఎవరికీ తెలియకుండా రహస్యంగా చేశాం గదా!'' అని. కానీ, వరుస తప్పకుండా చేసిందంతా తిరిగి ఎప్పుడో ఒకప్పుడు అనుభవించాల్సిందే. అందుకే భారతీయ తత్త్వశాస్త్రం ప్రతి పనిలోను ఒళ్ళు దగ్గర పెట్టుకోమని హెచ్చరిస్తుంటుంది. కర్మసిద్ధాంతాన్ని అంగీకరించకపోతే ఒకే తల్లికి పుట్టిన పిల్లల స్వభావాలు, సంస్కారాలు, జీవితాలు ఒకేరకంగా ఎందుకుండవనేది ప్రశ్న. పునర్జన్మను, పుణ్యపాపాలను ప్రపంచంలోని మేధావులందరు అంగీకరించారు. కాబట్టి తెలిసి చేసినా, తెలియక చేసినా, ఇతరులకు తెలిసేటట్లు చేసినా, రహస్యంగా చేసినా, మంచి చెడులకు ఫలితాలను మానవుడు అనుభవించి తీరుతాడు. తెలిసి తొక్కినా, తెలియక తొక్కినా నిప్పు కాలకుండా ఉంటుందా?

**38. ఎందులోనైనా ముందుచూపు ముఖ్యం :**

> గురులాఘవమర్థానామారంభే కర్మణాం ఫలమ్।
> దోషం వా యో న జానాతి స బాల ఇతి హోచ్యతే॥
> అవిజ్ఞాయ ఫలం యో హి కర్మ త్వేవానుధావతి।
> స శోచేత్ఫలవేలాయాం యథా కింశుకసేచకః॥ 63-7,9

ఏ పనైనా మొదలుపెట్టేముందు ఎలా చేస్తే తేలికో, ఎలా చేస్తే కష్టమో, ఏ పద్ధతిని అవలంబిస్తే ఎలాంటి ఫలితముంటుందో, అందులో గుణదోషాలేమిటో తెలుసుకోలేనివాడు చిన్న పిల్లవానితో సమానం. ఫలపరీక్ష చేయకుండా పని ప్రారంభించినవాడు చిట్టచివరికి నిష్ఫలమైన మోదుగచెట్టుకు నీళ్ళుపోసి పెంచిన వాడిలాగా నిరుత్సాహపడతాడు.

లోకంలో ప్రతివాళ్లూ ఎన్నో పనులు చేస్తుంటారు. కాని, కొంతమంది మాత్రమే ముందుచూపుతో ఆ కార్యానికి సంబంధించిన మంచిచెడ్డలను,ఫలితాన్ని చక్కగా ఊహించి దాన్నిబట్టి కావలసిన ముందు జాగ్రత్తలన్నీ తీసుకుంటారు. అందువల్లనే వాళ్ళు విజయాన్ని సాధించి తీరుతారు. ఇంకొంతమంది కళ్ళుమూసు కొని ఏదో ఒకటి జరుగుతుంది లెమ్మని కష్టసుఖాలు ఆలోచించకుండా అనుభ వజ్ఞుల సలహాలను పాటించకుండా పనిని ప్రారంభిస్తారు. చివరకు ఫలితం శూన్యం కావడమో, సమగ్రంగా లేకపోవడమో సంభవించినప్పుడు బాధ పడ తారు. మోదుగచెట్టుకు నీళ్ళుపోసి పెంచినవాడు చివరకు నిష్ఫలమైన పని చేశా నని బాధపడతాడు. అదే తియ్యమామిడి చెట్టును పెంచినవాడు. దాని పండ్లను వాడు అనుభవిస్తాడు. ఇతరులకూ పంచిపెడతాడు. అలాగే ఏ పనిలోనైనా ముందు ఆలోచన చేయాలి. సరైన నిర్ణయానికి రావాలి. తరువాత తీసుకున్న నిర్ణయాన్ని క్రమశిక్షణతో అమలుపరచాలి. అలాంటప్పుడు ఏ కార్యమైనా సఫల మౌతుంది.

**39. రాజులేని రాజ్యం అన్నింటికీ పూజ్యం :**

**యథా హ్యనుదకా నద్యః యథా వాప్యతృణంవనమ్।**
**అగోపాలా యథా గావః తథా రాష్ట్రమరాజకమ్॥ 67-29**

నీళ్ళులేని నదుల్లాగా, గడ్డిలేని అడవిలాగా, పాలకుడు లేని గోవుల్లాగా రాజులేని రాజ్యం శోభించదు.

జలప్రవాహాలు జలజలా పారుతుంటేనే అది నది అనిపించుకుంటుంది. మేటవేసిన ఇసుక తిన్నెలను చూచి ఎవరూ నది అని పిలవరు. అనేక తీగలు, లతలు, చెట్లు నిరంతరంగా ఉంటేనే అది అడవి అవుతుంది మోళ్ళు, రాళ్ళు ఉంటే దాన్నెవరూ అడవి అనరు. ఆవులకు కావలసిన మేతపెట్టి పోషిస్తూ, ఎలాంటి వ్యాధులు రాకుండా కాపాడుతూ, బయటకు తోలుకుపోయి తిప్పుతు వస్తూ కంటికి రెప్పలాగా కాపాడే గోపాలుడుంటేనే అవి ఆవులుగా మిగులుతాయి.

లేకపోతే అవి ఆరోగ్యంగా, బలంగా ఉండనే ఉండవు. అలాగే రాజ్యంలోని అన్ని వర్గాలవారికి కావలసిన సౌకర్యాలను చేస్తూ, తప్పుచేసినవాళ్ళను దండిస్తూ ధర్మాన్ని న్యాయాన్ని నిలబెడుతూ రాష్ట్రాన్ని సర్వతోముఖాభివృద్ధికి తీసుకు వచ్చే రాజుండేనే అది రాజ్యమౌతుంది. లేకపోతే అన్యాయాలకు, అక్రమాలకు, అధర్మాలకు ఆశ్రయమై అరణ్యంలాగా అయిపోతుంది. అందువల్ల సమర్థుడైన రాజుండేనే రాష్ట్రంలో సమగ్రమైన అభివృద్ధికి అవకాశం ఉంటుంది.

**40.** ప్రభువు లేనిచోట ప్రతివాడూ ప్రభువే :

> **నారాజకే జనపదే స్వకం భవతి కస్యచిత్।**
> **మత్స్యా ఇవ నరా నిత్యం భక్షయంతి పరస్పరమ్॥** 67-31

రాజులేని రాజ్యంలో ఎవరికీ ఏదీ స్వంతంకాదు. చేపల్లాగా ప్రజలు ఒకరి నొకరు మింగేయడానికి ప్రయత్నిస్తారు.

రక్షకుడు లేని రాజ్యంలో భక్షకులు వీర విహారం చేస్తుంటారు. ఎవరికీ తమ స్వంతమంటూ ఏదీ ఉండదు. ఏ అర్ధరాత్రి ఎవరొచ్చి కొల్లగొడతారో ఎవరికీ తెలియదు. శిక్షించే వాడెవడూ లేడు కాబట్టి దుండగులకు పండగరోజు లౌతాయి. శాంతి భద్రతలకు చోటే ఉండదు. పెద్దచేప చిన్నచేపను మింగినట్లు బలవంతుడు బలహీనుణ్ణి కొల్లగొడతాడు. ప్రభుత్వం లేదు కాబట్టి ప్రతివాడు స్వతంత్రుడై తానే రాజు ననుకుంటాడు. దీనివల్ల జాతి జీవనం స్తంభిస్తుంది. అరాచకం పెరిగి పోతుంది.

**41.** సమర్థుడైన రాజే సత్య ధర్మాలకు పుట్టిల్లు :

> **యథా దృష్టిః శరీరస్య నిత్యమేవ ప్రవర్తతే।**
> **తథా నరేంద్రో రాష్ట్రస్య ప్రభవః సత్యధర్మయోః॥** 67-33

సరైన మార్గంలో శరీరం నడవాలంటే మనకు కంటి చూపు కావాలి. అలాగే సమాజం సత్యధర్మాలపైన నడవాలంటే సమర్థుడైన సమ్రాట్ తప్పకుండా ఉండాలి.

గ్రుడ్డివాడు తనంతట తాను నడవగలుగుతాడా? ఏది నుయ్యో, ఏది గొయ్యో వాడికి తెలియదు. చేరవలసిన చోటుకు చేరాలంటే సరైన దోవలో పోయి తీరాలి. అలాగే సమాజంలో ప్రతివాడు సత్యధర్మాలకంకితమై జీవించాలంటే వాళ్ళను క్రమశిక్షణలో నడిపించే నరేంద్రుడు కావాలి. అంటే; మనలో సత్యం ఉండా

లన్నా, మనమార్గం ధర్మం కావాలన్నా వాటిని చక్కగా పాటించే పరిపాలకుడు కావాలన్నమాట.

**42.** ప్రజలకు సర్వస్వం ప్రభువే :

**రాజా సత్యం చ ధర్మశ్చ రాజా కులవతాం కులమ్।**
**రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్॥** 67-34

ప్రజలకు సత్యం, ధర్మం, కులం, తల్లి, తండ్రి, స్నేహితుడు అన్నీ పరిపాలకుడే.

ప్రజలలో సత్యాన్ని నిలబెట్టేవాడు, ధర్మాన్ని ఉద్ధరించేవాడు, కులమర్యాదను కాపాడేవాడు, తల్లిలాగా జాలిపడేవాడు, తండ్రిలాగా మంచిదోవలో పెట్టేవాడు, స్నేహితుడిలాగా కష్టాల్లో ఆదుకొనేవాడు - ఇది అది ఏమిటి; సమస్తం సార్వభౌముడే. ఇలా ప్రజల రక్షణలో ఇన్ని పాత్రలను నిర్వహించగలవాడే రాజ్యానికి అర్హుడు. అలా కానివాడు పేరుకు రాజే కాని రక్షకుడు మాత్రం కాలేడు. పిల్లలను తల్లి తండ్రి పెంచి పెద్ద చేసినట్లు ప్రజలను రాజు అన్ని విధాలా కాపాడుతూ పైకి తీసుకురావాలి. అలాంటి ప్రభువు కోసం ప్రజలు ప్రాణాలైనా అర్పించడానికి వెనుకాడరు.

**43. పిల్లవాడి తరువాతే తల్లికెవరైనా :**

**అంగప్రత్యంగజః పుత్రో హృదయాచ్చాపి జాయతే।**
**తస్మాత్ప్రియతమో మాతుః ప్రియత్వాన్నతు బాంధవాః॥**
74-14

తల్లి శరీరంలోని ప్రతి అంగంలోనుంచి పుట్టే పుత్రుడు ఆమె హృదయం నుంచి కూడ పుడుతున్నాడు. హృదయం కంటే ప్రియమైంది ఏముంటుంది ? అందువల్లనే బంధువులందఱికంటే తల్లికి పిల్లవాడే ప్రియాతిప్రియమైనవాడు.

ఈ లోకంలో కన్నకడుపు కంటే మిన్న ఏముంటుంది ? ఎంతమంది బంధువులున్నా అందఱు ఆత్మజుని తరువాతి వాళ్ళే. తల్లి ప్రతి అంగం నుంచి పిల్లవాడు పుడుతున్నాడు. అందుకే 'అంగాదంగాత్సంభవసి' అంటుంది శ్రుతి. తల్లి పది మాసాలు మోసి కని పెంచి పిల్లవాణ్ణి తనకు, తన హృదయానికి, తన ఆశలకు ఆశయాలకు అనుగుణంగా తీర్చిదిద్దుతున్నది. అవసాన కాలంలో అతడే జీవితానికి ఆలంబనం అనుకొంటున్నది. అందుకనే బంధువు లెందఱున్నా కన్న కొడుకుకంటే వాళ్లెవరూ ఎక్కువ కాదు. అందరికంటే మిన్న అతడొక్కడే.

**44. గిట్టనివాడిని వదలిపెట్టాలి :**

పూర్వాపకారిణాం త్యాగే న హ్యధర్మో విధీయతే। 96-24

ఇదివఱకు మనకు అపకారం చేసినవాణ్ణి వదిలిపెట్టడంలో అధర్మమేమీ లేదు.

అపకారికి ఉపకారం చేయాలనేది గొప్ప విషయమే. ఉపకారం చేయ బోయి ఆత్మవినాశం తెచ్చుకొనేకంటే వాణ్ణి దూరంగా వదిలిపెట్టి మన పని మనం చేసుకోవడంలో తప్పులేదు. అపకారం చేసినవాడు కొంతకాలం తరువాత కొంచెమైనా మారితే, ఇదివఱకటి అపకారం మనసులో పెట్టుకోకుండా ఉపకారం చేయాలనుకోవడం అభినందనీయమే. కానీ, వాడు ముందుకంటే పెద్ద అపకారం తలపెట్టినప్పుడు, వాడికి ఎలాగైనా ఉపకారం చేయాలనుకోవడం అవివేకమే అవుతుంది. అలాంటప్పుడు వాణ్ణి దూరంగా పెట్టడం ధర్మదూరం కాదు.

**45. ఒక్క మేధావి చాలు :**

సహస్రాణ్యపి మూర్ఖాణాం యద్యుపాస్తే మహీపతిః।
అథవాప్యయుతాన్యేవ నాస్తి తేషు సహాయతా॥
ఏకోఽప్యమాత్యో మేధావీ శూరో దక్షో విచక్షణః।
రాజానం రాజమాత్రం వా ప్రాపయేన్మహతీం శ్రియమ్॥
100-24, 25

మూర్ఖులు వెయ్యిమందైనా పది వేలమందైనా ప్రభువుకు ఒరిగే ప్రయోజనమేదీ లేదు. మేధావి, శూరుడు, సమర్థుడు, పండితుడైన ఒకే ఒక అమాత్యుడున్నా, నిజంగా సమర్థుడైన రాజుకు లేక కేవలం రాజని పిలవబడే వాడికి కూడా అతడు గొప్ప రాజ్య సంపదను సంపాదించి పెట్టగలడు.

రాజు చుట్టూ భట్రాజులు ఎంతో మంది ఉంటారు. వాళ్ళు ఎన్ని వేల మంది ఉన్నా రాజ్యంలో ఏదైనా అత్యవసర పరిస్థితి ఏర్పడినప్పుడు, రాజ్యానికి ప్రమాదం వాటిల్లినప్పుడు వాళ్ళు చేయగల సహాయం ఏదీ ఉండదు. అందు వల్లనే తన చుట్టూ ఎంత మంది మూర్ఖులు ఉన్నా; వివేకం గల రాజు మేధావి, పరాక్రమవంతుడు, సమర్థుడు, రాజనీతి నిపుణుడైన మహా మంత్రితో ప్రతి విష యాన్ని కూలంకషంగా చర్చించాలి. రాజు సమర్థుడైనా కాకపోయినా రాజ్యాన్ని చక్కగా పరిపాలించేట్లు అలాంటి మంత్రి సలహాల నిచ్చి సహాయపడతాడు.

కాబట్టి అభివృద్ధిని కోరే మహారాజు మేధావుల నెప్పుడూ మన్నిస్తూ వారి సలహాలను తప్పక పాటించాలి.

**46. సేవకుల కోపం పాలకులకే తాపం :**

కాలాతిక్రమణాచ్చైవ భక్తవేతనయో ర్భృతాః।
భర్తుః కుప్యన్తి దుష్యన్తి సోఽనర్థః సుమహాన్స్మృతః॥
100-34

భృత్యుల కివ్వాల్సిన ఆహార ధాన్యాలు, జీతం ఎప్పటికప్పుడు ఆలస్యం లేకుండా బట్వాడా చేయించాలి. అలా కాకపోతే వాళ్ళు రాజుపైన ఆగ్రహాన్ని ప్రదర్శించి దూషిస్తారు. అలా జరగడం ప్రభుత్వానికే ముప్పు.

తన సేవకుల మంచి చెడ్డలను ప్రభువు జాగ్రత్తగా విచారించాలి. జీతాలు ఇవ్వడంలోగాని, వాళ్ళ తిండికి కావలసిన ఆహార ధాన్యాలు సరఫరా చేయడంలో గాని ఏమాత్రం ఆలస్యం జరగనీయకూడదు. ఏ రాజ్యంలోనైనా రాజుకు తెలియకుండా యంత్రాంగంద్వారా అలాంటి ఆలస్యం జరిగితే; రాజు వెంటనే తగిన చర్య తీసుకొని, ప్రజలు రెచ్చిపోకుండా చూసుకోవాలి. ప్రజలు ఆగ్రహిస్తే ప్రభుత్వం గడగడలాడిపోతోంది. అది రాష్ట్రానికే మంచిదికాదు.

**47. ప్రభుదోషాలు పద్నాలుగు :**

నాస్తిక్యమనృతం క్రోధం ప్రమాదం దీర్ఘసూత్రతామ్।
అదర్శనం జ్ఞానవతాం ఆలస్యం పంచవృత్తితామ్॥
ఏకచింతనమర్థానాం అనర్థజ్ఞైశ్చ మన్త్రిణమ్।
నిశ్చితానామనారంభం మన్త్రిస్యా పరిరక్షణమ్॥
మంగళస్యా ప్రయోగం చ ప్రత్యుత్థానం చ సర్వతః।
.....................రాజదోషాశ్చతుర్దశ॥ 100-65, 67

నాస్తికత్వం, అసత్యం, క్రోధం, పొరపాటు, త్వరగా నిర్ణయించుకోలేకపోవడం, జ్ఞానులను ఆదరించకపోవడం, సోమరితనం, భౌతిక సుఖాలకు బానిస కావడం, ఒంటరిగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవడం, రాజనీతి తెలియని వారితో సంప్రదించడం, తీసుకున్న నిర్ణయాలను అమలుపరచకపోవడం, మంత్రాలోచనాన్ని బట్టబయలు చేయడం, మంగళకరమైన పనులు చేయకపోవడం, అందరికీ లేచి ఎదురు వెళ్ళడం- అనే ఈ పద్నాలుగు రాజులకుండే దోషాలు.

ప్రభువు ఉత్తముడైతే ప్రభుత్వం కూడా ఉత్తమంగా ఉంటుంది. ప్రభువులో సుగుణాలు పుష్కలంగా ఉన్నా లేకపోయినా; అవగుణాలు మాత్రం ఏ ఒక్కటీ ఉండకూడదు. అయితే ఏయే అవగుణాలు ఉండకూడదనేది ప్రశ్న. అందుకే రాజులో ఉండకూడని పద్నాలుగు దుర్గుణాలను చెబుతున్నాడు. జితేంద్రియుడైన మహర్షి. పరిపాలకులు పనిగట్టుకొని ఈ పద్నాలుగింటిని తమలో లేకుండా చూసుకుంటే రాజ్యం సకల సంపదలతో కళకళలాడుతుంది.

**48.** మన చేతుల్లో ఏమీ లేదు :

> నాత్మనః కామకారోఽస్తి పురుషోఽయమనీశ్వరః।
> ఇతశ్చేతరతశ్చైనం కృతాన్తః పరికర్షతి॥ 105-15

అనుకున్నది అనుకున్నట్లు చేయడానికి మన చేతుల్లో ఏమీ లేదు. అదృష్టం మనల్ని అటు ఇటు తిప్పుతూ జరగవలసిందాన్ని జరిపిస్తుంది.

'నేనే అంతా చేస్తున్నా'నని ప్రతివాడు అహంకారపడతాడు. నిజమాలోచిస్తే, నీవు చేస్తున్నది, చేయగలిగింది ఏదీలేదు. నిన్ను నీవు నడిపించుకొని, అనుకున్నదాన్ని సాధించుకొనే శక్తి పూర్తిగా నీకు లేనే లేదు. నీ పనులన్నీ దైవాధీనంగానే జరుగుతున్నాయి. దైవమంటే అదృష్టమే. అదృష్టం ఎన్ని వైపుల తిప్పితే నీవన్ని వైపుల తిరుగుతావు. అది ఎప్పుడు అనుకూలిస్తే అనుకోకుండా నీ పనులు అప్పుడు పూర్తవుతాయి. నీ అదృష్టాన్ని నీవు నియమించలేవు. దాన్ని నియమించగలవాడు భగవాన్ ఒక్కడే.

**49.** పెరుగుట విరుగుట కొఱకే :

> సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః।
> సంయోగా విప్రయోగాన్తా మరణాన్తం చ జీవితమ్॥ 105-16

సకల సంపదలు నశించిపోయేవే. అత్యున్నతస్థాయి నందుకొన్న అభివృద్ధులన్నీ ఒకరోజుకు అడుగంటి పోయేవే. కలయికలన్నీ వేఱుపాటును తప్పించుకోలేవు. ఎంత గొప్పగా జీవించినా మరణం తప్పదు.

అందమైన ఈ ప్రపంచం అశాశ్వతమైంది ఎంతో శాశ్వతంగా కనపడే ప్రకృతి క్షణంలో కనుమరుగైపోతుంది. ఎన్ని ఆకర్షణల మధ్యలో ఉన్నా మానవుడు ఎక్కువ మమకారం పెట్టుకోగూడదు. కష్టపడి సంపాదించుకున్న సిరిసంపదలు, భోగభాగ్యాలు ఎన్నటికీ శాశ్వతమైనవి కావు. ఇప్పటి కెంతమంది సంపాదించారో ఎంతమందికి వదిలేసి వెళ్ళిపోయారో! అడుగడుగునా అతిక్లేశంతో చేపట్టిన పదవులు, అధిష్ఠించిన పీఠాలు, సాధించిన అభివృద్ధులు అలాగే పదిలంగా

పది కాలాలపాటు నిలబడతాయా? ఎప్పటికీ నిలబడవు. వారే వీరుగా, వీరే వారుగా అద్వైత భావనతో ఆనందించినా ఆఖరుకు ఎవరి దోవ వారిదే. నీ జీవితాన్ని ఎంత చక్కగా తీర్చిదిద్దుకున్నా ఏదో ఒక రోజు నీ పీఠోకాన్ని పీడిపోక తప్పదు. సర్వం దుఃఖం దుఃఖం. సర్వం క్షణికం క్షణికం. సత్యాన్ని అన్వేషించు!

**50. చావును మించిన భయం లేదు :**

యథా ఫలానాం పక్వానాం నాన్యత్ర పతనాద్భయమ్।
ఏవం నరస్య జాతస్య నాన్యత్ర మరణాద్భయమ్॥ 105-17

చెట్టున పండిన పండ్లు ఏదో ఒకనాడు నేల రాలవలసిందే. అలాగే పుట్టిన ప్రతివాడు ఏదో ఒకరోజు గిట్టి తీరవలసిందే.

పూసిన ప్రతి పూవు కాయ కాదు. కాసిన ప్రతి కాయ పండు కాదు. కాని పండిన ప్రతి పండు మాత్రం రాలిపోక తప్పదు. మానవుడు పుడుతున్నాడు. ఏదేదో చేసేశానని, ఇంకేదో చేయాలని ఆరాటపడుతున్నాడు. తన జీవితం శాశ్వతమనే భ్రమలో తలక్రిందులౌతున్నాడు. పదేపదే ప్రకృతి బెదిరింపులకు భయపడుతున్నాడు. 'ఆc-ఇది ఇంతేలే!' అని అలవాటుపడిపోతున్నాడు. అహంకారాన్ని అడ్డంగా పెట్టుకొని, ధైర్యంగా ఉన్నట్టు, భయమే లేనట్టు అభినయం చేస్తున్నాడు. అంతవరకు అంతా బాగానే ఉంది. జీవిత రణధీరుణ్ణనుకొనే ఈ అమాయకుడు మరణానికి తలవంచక తప్పదు. అక్కడే వుంది నిజమైన భయం. ఆ భయం పోవాలంటే; అభయం కావాలంటే; కావాలి భగవాన్ అనుగ్రహం. సత్య ధర్మాలతో శాంతి ప్రేమలను ఇప్పుడే ఇక్కడే ఈ జీవితంలోనే సాధించడానికి చేయాలి ప్రయత్నం అప్పుడే మృత్యువును చిరునవ్వుతో ఆహ్వానించ గలుగుతాడు. అమృత స్వరూపు డౌతాడు.

**51. తీరిపోయినకాలం తిరిగి రానేరాదు :**

అత్యేతి రజనీ యాతు సాన ప్రతినివర్తతే।
యాత్యేవ యమునా పూర్ణా సముద్రముదకాకులమ్॥ 105-19
అహోరాత్రాణి గచ్ఛన్తి సర్వేషాం ప్రాణినామిహ।
ఆయూంషి క్షపయన్త్యాశు గ్రీష్మే జలమివాంశవః॥ 105-20

గడచిపోయిన రాత్రి గడబిడ చేసినా తిరిగి రానేరాదు. అర్ణవంలోకి పరిపూర్ణంగా ప్రవహించే యమునానది వెనక్కి రమ్మంటే రాగలుగుతుందా? రోజులు గడుస్తుంటే మోజులు తీర్చుకుంటున్నాడు మానవుడు. కానీ నిదాఘంలో

సూర్యకిరణాలు నీళ్ళ నావిరి చేసినట్లు, గడుస్తున్న రాత్రింబవళ్ళు గప్‌చిప్‌గా మన ఆయుష్యాన్ని ఖర్చు రాస్తున్నాయి.

ఈ లోకంలో ఎంతో విలువైంది కాలం. జీవితంలో ప్రతివాడు సద్వినియోగం చేసేకాలం కంటే దుర్వినియోగమైపోయే కాలమే ఎక్కువ. గడచిపోయిన కాలం గల్లంతుచేసినా రాదు. సముద్రంలో ఎగిరి దూకినా యమునా ప్రవాహం వెనక్కు రామ్మా ! అంటే వస్తుందా? ఎన్నటికీ రాదు. జీవితం కూడా అంతే. జీవితమనే గడియారంలో సంవత్సరాలు, నెలలు, రోజులు, కాలాన్ని సూచించే ముల్లులాంటివి. ముళ్ళు బాగా తిరుగుతున్నాయని సంతోషపడితే సరిపోలేదు. త్వరలోనే గంట గణగణా మోగుతుందని గమనించి జాగ్రత్తపడాలి.

**52. నీ గురించి నువ్వేడవటం మంచిది !**

**ఆత్మానమనుశోచ! త్వం కిమన్యమనుశోచసి।**
**ఆయుస్తే హీయతే యస్య స్థితస్య చ గతస్య చ॥ 105-21**

ఇతరులను గురించి బాధపడి ఏం ప్రయోజనం? నీ గురించి నీవు బాధపడు! నీవెక్కడున్నా కూర్చున్నా, నడుస్తున్నా, నీ ఆయుష్యం గడచిపోతూనే ఉంది. ఈ సత్యాన్ని సత్వరం గుర్తించు !

లోకాన్నిచూచి రెండు రకాల బాధపడేవాళ్ళున్నారు. తను బాగా సుఖంగా ఉన్నట్లు, ఇతరులంతా ఎంతో బాధల్లో ఉన్నట్లు, ఎలాగైనా వాళ్లకు సహాయం చెయ్యాలని బాధపడేవాళ్ళు కొందరు. ఇతరులంతా చాలా సుఖంగా ఉన్నట్లు తనొక్కడే దుఃఖాన్ననుభవిస్తున్నట్లు తన కెవరూ సహాయం చేయడం లేదని బాధపడేవాళ్ళు కొందరు. ఇతరులను గురించి ఎలా బాధపడ్డా అది తప్పే అవుతుంది. నిన్ను గురించి ముందు బాధపడు! కూర్చున్నా, నడుస్తున్నా, నీ ఆయుష్యం కరిగిపోతూనే ఉంది. ఈ రహస్యాన్ని గుర్తించు! జీవితాన్ని సార్థకం చేసుకోడానికి ప్రయత్నించు.

**53. మృత్యుదేవత నీవెంటే ఉంటుంది !**

**సహైవ మృత్యుర్వ్రజతి సహ మృత్యుర్నిషీదతి।**
**గత్వా సుదూరమధ్వానం సహ మృత్యుర్నివర్తతే॥ 105-22**

నీ మృత్యువు నీతోనే వస్తుంది. నీ దగ్గతే కూర్చుంటుంది. నీవెంత దూరం ప్రయాణం చేస్తే, అది కూడా అంతదూరం నీ వెంటనే ఉంటుంది. నీ తిరుగు ప్రయాణంలోనే నీతోనే తిరిగి వస్తుంది.

పాపం! మృత్యుదేవత ఎక్కడో ఉంటుంది, ఎప్పుడో వస్తుంది అను కుంటారు. అది అబద్ధం. మన మృత్యువు మనతోనే ఉంటుంది. మనం నడిస్తే అదీ నడుస్తుంది. మనం కూర్చుంటే అదీ కూర్చుంటుంది. మనం సుదూర ప్రాంతాలకు వెడితే అదీ మనవెంటే తిరిగివస్తుంది. అంటే మృత్యువు ఏ క్షణంలోనైనా నిన్ను కబళించడానికి కాచుకునే కూర్చుంటుందని భావం. అయితే దానికి ఏదో ఒక నిమిత్తం దొరకాలి. ఆయుష్యం పూర్తయితే నిమిత్తం అట్టే దొరికిపోతుంది. అందువల్ల ప్రతిక్షణం దేనికైనా సిద్ధంగా ఉండాలి.

**54. ఎంత పిచ్చిదీ లోకం!**

నన్దన్త్యుదిత ఆదిత్యే నన్దన్త్యస్తమితే రవౌ।
ఆత్మనో నావ బుధ్యన్తే మనుష్యా జీవితక్షయమ్॥ 105-24

ఆదిత్యుడుదయించాడని, అస్తమించాడనీ ఆనందపడతారు మానవులు. కాని తమ ఆయుష్యాన్ని అహర్నిశలు అపహరిస్తున్నాయని అర్థం చేసుకోలేరు అభాగ్యులు.

అబ్బ! సూర్యుడుదయించాడు. ఎన్ని పనులు చేయాలో అని, సాయంకాలమై పోయింది ఇక విశ్రాంతి తీసుకోవచ్చునని ఎంతో సంతోషిస్తారు. నిజంగా దుఃఖ పడాల్సిందానికి సంతోషపడుతున్నారు. ఒక్కొక్కరోజు గడిచే కొద్దీ మృత్యువుకు ఒక్కొక్క మజిలీ దగ్గఱ పడుతున్నావు. ఈ రహస్యాన్ని మాయవల్ల గుర్తించ లేకపోతున్నావు. ఈ సత్యాన్ని గుర్తించి 'దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టు' కొనే ప్రయత్నం ఏదైనా చేసుకోవాలి. లేకపోతే భవిష్యత్తు అంధకార బంధుర మౌతుంది.

**55. ఎక్కడి పెళ్లాం? ఎక్కడి పిల్లలు?**

యథా కాష్ఠం చ కాష్ఠం చ సమేయాతాం మహార్ణవే।
సమేత్య చ వ్యపేయాతాం కాలమాసాద్య కంచన॥
ఏవం భార్యాశ్చ పుత్రాశ్చ జ్ఞాతయశ్చ ధనాని చ।
సమేత్య వ్యవధావన్తి ధ్రువో హ్యేషాం వినా భవః 105-26,27

రెండు నదీ ప్రవాహాల నుంచి కొట్టుకొచ్చిన కట్టెలు రెండు, సముద్రంలో కొంతసేపు కలసి ఉంటాయి. మళ్ళా కొంతసేపటికి విడివడిపోతాయి. అలాగే భార్యలు, పుత్రులు, ధనధాన్యాలు, దాయాదులు మనతో కలిసి కొంతకాలం ఉండి మళ్ళా ఎవరిదోవన వాళ్లు పోతారు. కలసిఉండకపోవడమే శాశ్వతలక్షణం.

'నా భార్య, నాపిల్లలు, నాబంధువులు, నా ఆస్తిపాస్తు'లని మానవుడు వెర్రి మమకారం పెంచుకుంటాడు. నిజానికి ఈ సంబంధాలన్నీ మనం కల్పించుకొన్నవే. ఈ లోకంలో ఎవరికీ ఎవరూ ఏమీ కారు. ఆ నదినుంచి ఒక చెట్టు, ఈ నది నుంచి ఒక కొమ్మ రెండూ కొట్టుకువచ్చి సాగరసంగమంలో హఠాత్తుగా కలిశాయి. కొంచెంసేపు ప్రవాహానికి అనుగుణంగా కలిసే ప్రయాణం చేశాయి. మళ్ళా వేటి దోవన అవి పోయాయి. అలాగే మనతో అనేకమంది జీవులు ఈ సంసార సాగరంలో భార్యలని, కొడుకులని, బంధువులని, మిత్రులని అనేక సంబంధాలతో కొంతకాలం కలిసి ఉంటారు. అంతమాత్రంచేత వీళ్ళు శాశ్వతంగా మనతో కలిసే ఉంటారని భ్రమపడకూడదు. కర్మకారణ, కర్తవ్యాలు తీరిపోతే 'ఎవరికివారే యమునాతీరే' అన్నట్లు ఎవరి దోవన వాళ్ళు పోతారు. కలవకపోవడమే సహజ లక్షణం. ఏవో కొన్ని నిమిత్తాల వల్లనే కలయిక ఏర్పడుతూ ఉంటుంది.

**56.** ఒకరు ముందు; ఇంకొకరు వెనుక :

> యథా హి సార్థం గచ్ఛన్తం బ్రూయాత్కశ్చి త్పథి స్థితః।
> అహమప్యాగమిష్యామి పృష్ఠతో భవతామితి॥
> ఏవం పూర్వగతో మార్గః పితృపైతామహో ధ్రువః।
> తమాపన్నః కథం శోచేద్యస్య నాస్తి వ్యతిక్రమః॥

105-29,30

బాటసారి తనకు ముందుపోయే ప్రయాణీకుల గుంపుతో 'మీ వెనుకే నేనూ వస్తున్నాను' అని చెప్పి, వాళ్లను అనుసరిస్తాడు. అలాగే మన తండ్రి తాతలు పోయిన మార్గంలోనే మనమూ పోవలసిందే. ఆ మార్గంలో పోతూనే బాధపడటం వల్ల ప్రయోజనం లేదు. అది మారేది కాదు.

మన తాత, ముత్తాతలు మనకంటే ముందే పుట్టి పెరిగి, ఈ మహాకాలంలో కలిసిపోయారు. 'మేమూ మీ వెనుకే వస్తున్నామ'ని చెప్పి, వాళ్ళ మార్గాన్నే అనుసరించి వెడుతున్న మనం మరణాన్ని గురించి మతిపోగొట్టుకోకూడదు. వాళ్లెలా పోయారో మనం అలాగే పోకతప్పదు. దీన్ని తప్పించే వాళ్లెవరూ లేరు. కాకపోతే, వాళ్లు మనకంటే ముందు వెళ్ళిపోయారు. మనం వాళ్ళ వెనుకనే పోతున్నాం. ఇక్కడ శాశ్వతంగా పీఠం వేసుకొని కూర్చునేవాడెవడూ లేడు. ఎవరెవరి ప్రారబ్ధం ఎంతవరకో అంతవరకూ వద్దన్నా, కాదన్నా, ఉండకా

తప్పదు. అది తీరిపోయింతరవాత ఉంటానన్నా ఒక్క క్షణం కూడా ఉండ నివ్వరు.

**57. దుఃఖాన్ని దూరంగా నెట్టు :**

**ఏతే బహువిధాః శోకాః విలాపరుదితే తథా।**
**వర్జనీయా హి ధీరేణ సర్వావస్థాసు ధీమతా॥** 105-35

వివేకం కలిగి ధీరుడైనవాడు ఎలాంటి పరిస్థితిలోను విలపించడం, ఏడవటం, బాధపడటం మొ॥ శోకావస్థలకు లొంగిపోకూడదు. వాటిని దూరంగా నెట్టివేయాలి.

శోకాన్ని జయించడం చాలా కష్టం. విలాపం, ప్రలాపం, రోదనం, ఆవేదన ఇవన్నీ శోకావస్థలు. ప్రతివాడు ప్రయత్నపూర్వకంగా వీటిని బహిష్కరించాలి. ఎన్నో దుర్భరమైన కష్టాలు రావచ్చు. ఎవరితోను చెప్పుకోలేని వేదన లుండవచ్చు. వాటిని వివేకంతో ప్రత్యేకంగా అర్థం చేసుకొని ధైర్యంగా ఎదిరించాలి. అంతేకాని, పిరికితనంతో పారిపోకూడదు.నిరుత్సాహాన్ని,నిర్వేదాన్ని నిలువ నీడ లేకుండా చేయాలి. అలాంటివాడే ఈ లోకంలో దేన్నైనా సాధించ గలుగుతాడు.

**58. ఒంటరిగానే వచ్చి ఒంటరిగానే పోతున్నాడు :**

**కః కస్య పురుషో బంధుః కిమాప్యం కస్య కేన చిత్।**
**యదేకో జాయతే జంతురేక ఏవ వినశ్యతి॥** 108-3

ఈ లోకంలో ఎవరికెవరు బంధువు? ఎవరినుంచి ఎవరు దీన్ని సంపాదించాలి? ఏ అంతిమ ప్రయోజనాన్ని ఆశించి ఇదంతా చేయాలి? మానవుడు ఒంటరిగానే పుడుతున్నాడు. చివరకు ఒంటరిగానే పోతున్నాడు.

కొంతమంది చెబుతుంటారు- "మాది చాలా పెద్ద వంశమండి. అంతెందుకు, మా కుటుంబం చూడండి మర్రిచెట్టులాగా ఎంతగా విస్తరించిందో" నని ఇదంతా వట్టి భ్రమ. ఈ బంధుత్వాలు మాయా కల్పితాలు, ఈ సంబంధాలు తెచ్చిపెట్టుకున్నవి. ఏదో సాధించానను కోవడం, ఏదో సంపాదించాననుకోవడం, దేనితోనో ఇంకేదో పొందగలననుకోవడం మండుటెండల్లో మంచినీళ్ళకోసం ఎండమావుల వెంటపడటంలాంటిదే. నీవు పుట్టేది ఒంటరిగా. మళ్లా గిట్టేది ఒంటరిగా ఈ మధ్యలో ఉన్నది మాయ అదే నాటకం. అది ఉత్త బూటకం.

59. ఇవన్నీ అతిథి భవనాలే :

యథా గ్రామాన్తరం గచ్ఛన్నరః కశ్చిత్క్వచిద్వసేత్।
ఉత్సృజ్య చ తమావాసం ప్రతిష్ఠేతాపరేఽహని॥
ఏవమేవ మనుష్యాణాం పితా మాతా గృహం వసు।
ఆవాసమాత్రం (కాకుత్స్థ) సజ్జన్తే నాత్ర సజ్జనాః॥ 108-5,6

పరాయి ఊరుకు పోయినప్పుడు ఏదో ఒక పంచలో కొంచెంసేపుంటావు. అంతటితో అది నీదౌతుందా? పని పూర్తిఅయిన మరుక్షణం ఆ వసతిని వదలి పెట్టి ఆరంభిస్తావు నీ ప్రయాణం. అలాగే తల్లి, తండ్రి, ఇల్లు, డబ్బు ఇవన్నీ విశ్రాంతి గృహాల్లాంటివే. శాశ్వతంగా నీ దగ్గరే నిలబడేవి కావు. ఇలాంటి విష యాల్లో సజ్జనులు అందుకే ఆసక్తిని పెంచుకోరు.

మమకారం మానవుణ్ణి కట్టిపడేస్తుంది. మాయ ప్రభావంవల్లనే మమకారం మరి మరీ పెరుగుతుంది. బంధం పెరిగి పెరిగి మానవుణ్ణి కర్మబద్ధుణ్ణి చేస్తుంది. నా తల్లి, నా తండ్రి, నా ఇల్లు, నా ఆస్తి అనుకుంటాడు ప్రతివాడు. క్షణకాలపు మురిపాలే ఇవన్నీ. పనిమీద వెళ్ళి పరాయి ఇంట్లో రెండు పూటలు వుంటే అది మనదెలా అవుతుంది? అలాగే ఈ సంబంధాలన్నీ అశాశ్వతమైనవి. అట్టేకాలం నిలబడేవి కావు వివేకంగలవాళ్ళు వీటిపైన మోజుపడరు. వాళ్ళకు తెలుసు- ఇవి ఏనాటికైనా దూరమవుతాయని, దుఃఖాన్ని కలిగిస్తాయని. అందుకే అంటీ అంటకుండా, ముట్టీ ముట్టకుండా, చూచీ చూడకుండా కాలాన్ని గడపాలి.

60. మర్యాదను కోల్పోతే మంచివాళ్లు మెచ్చరు :

నిర్మర్యాదస్తు పురుషః పాపాచారసమన్వితః।
మానం న లభతే సత్సు భిన్నచరిత్రదర్శనః॥ 109-3

మర్యాద లేనివాడు, పాపిష్ఠి పనులు చేసేవాడు, చెప్పింది చేయనివాడు మంచివాళ్ళ గౌరవాన్ని కొంచెంకూడా పొందలేడు.

మంచీ మర్యాద లేకుండా తప్పుడుపనులు చేస్తూ అబద్ధమైన జీవితాన్ని అనుభవించేవాడు సజ్జనుల సత్కారాన్ని పొందలేడు. సజ్జనులు మెచ్చనివాణ్ణి ఈ సమాజం గౌరవించదు. వాడికి చరిత్రలో స్థానం ఉండదు. అందువల్ల దేన్ని అయినా కోల్పోవచ్చుగాని మంచితనాన్ని, మర్యాదను కోల్పోకూడదు. ఎంతటి క్లిష్ట పరిస్థితుల్లోకూడా అధర్మమార్గాన్ని అవలంబించకూడదు మిన్ను విరిగి మీద పడ్డా చెప్పింది చేసి తీరాలి చేయలేని మాటలను చెప్పనేకూడదు.

**61. నడవడిని బట్టి కులగోత్రాలు :**

కులీనమకులీనం వా వీరం పురుషమానినమ్।

చారిత్ర మేవ వ్యాఖ్యాతి శుచిం వా యది వాఽశుచిమ్॥ 109-4

ఒక వ్యక్తి గొప్ప కులంవాడో, తక్కువ కులంవాడో, శూరుడో, భీరువో, పవిత్రుడో అపవిత్రుడో అతని చరిత్ర చెప్పాలి.

నడవడి సరిగా లేకపోతే ఎంత గొప్ప కులంలో పుట్టినా ఏం ప్రయోజనం? ఎంత పరాక్రమవంతుడైతే ఏం లాభం? ఎంత ఆచారపరుడైతే ఏం జరుగుతుంది? కులాన్ని, పరాక్రమాన్ని, పవిత్రతను ఆ వ్యక్తి నడవడి మనకు తెలియజేయాలి. ఎన్ని ఉన్నా నడవడి సరిగాలేనివాడు నగుబాట్ల పాలౌతాడు. కాబట్టి ప్రతివాడు తన వ్యక్తిత్వాన్ని చక్కగా తీర్చిదిద్దుకోవాలి.

**62. యథా రాజా తథా ప్రజా :**

యద్వృత్తాః సన్తి రాజానః తద్వృత్తాః సన్తి హి ప్రజాః।

109-9

ప్రభువు ప్రవృత్తినిబట్టి ప్రజల ప్రవృత్తి ఉంటుంది.

ధరణీపతి ధర్మపరుడైతే సమాజం ధర్మబద్ధంగా ఉంటుంది. అధిపతి అర్థపరుడైతే ప్రజలు కూడా అర్థాసక్తితో ఉంటారు. మహీపతి కామపరుడైతే మానవులు కూడా కామాసక్తులౌతారు. రాజునను సరించే రాజ్యాంగం. రాజ్యాంగాననుసరించే పరిపాలన. పరిపాలననుబట్టే ప్రజల ప్రవృత్తులు. కనుక రాజు బాగుపడితే క్రమంగా రాజ్యమూ బాగుపడుతుంది.

**63. సత్యంలోనే లోకం ఉంది :**

సత్యమేవానృశంసం చ రాజవృత్తం సనాతనమ్।

తస్మాత్సత్యాత్మకం రాజ్యం సత్యే లోకః ప్రతిష్ఠితః॥ 109-10

ప్రాచీనుల పరిపాలన సత్యంపైన దయపైన ఆధారపడి ఉండేది. లోకమంతా సత్యంపైనే నిలబడటంచేత ప్రధానంగా ప్రభుత్వం సత్యాన్ని ఆశ్రయించే నిలుస్తుంది.

సత్యం లేకపోతే లోకమే లేదు. లోకవృత్తమంతా సత్యాన్ని ఆశ్రయించే సాగుతోంది. సత్యానికి స్థానం లేకపోబట్టే ఈనాడు సమాజంలో శాంతి లేదు. సత్యం శాశ్వత లక్షణం కలది. మనం మారిస్తే మారేదీ కాదు; దాచిపెడితే దాగేదీ కాదు. ప్రాచీన కాలంలో ప్రభువులందరు సత్యానికి తలఒగ్గేవారు. దాన్ని

అన్ని విధాలా కాపాడేవారు. సత్యాన్ని సంస్థాపించడం కోసం స్వార్థాన్ని కూడా పరిత్యజించేవారు. చూడండి:- హరిశ్చంద్రుడందుకే సత్యహరిశ్చంద్రుడైనాడు. సత్యాన్ని సరిగా చూడకపోతే, సర్వం అంధకారబంధురమౌతుంది అందుకే 'సత్యం వద' అని స్వాధ్యాయం శాసిస్తోంది.

**64.** సత్యాన్ని సాధిస్తే స్వర్గాన్ని పొందచ్చు।

**ఉద్విజన్తే యథా సర్పాన్నరాదనృతవాదినః।**

**ధర్మః సత్యం పరో లోకే మూలం స్వర్గస్య చోచ్యతే॥**109-12

అబద్ధాలు చెప్పేవాణ్ణి చూస్తే పామును చూసినట్లు భయపడుతుంది లోకం. సత్యమే గొప్ప ధర్మం. అదే స్వర్గానికి గూడా మూలం.

నడవడినిబట్టే నమ్మకం పెంచుకుంటుంది ఈ సమాజం. జనం అబద్ధాలాడేవాణ్ణి అల్లంతదూరంలో చూసి పామును చూసినట్లు పారిపోతారు. ఈ లోకంలో సత్యాన్ని మించిన ధర్మమే లేదు. పరలోక ప్రాప్తికి గూడా సత్యమే నిత్యం కారణమౌతుంది. సత్యాన్ని కాపాడుకోటానికే సజ్జనులు మితభాషణం చేస్తారు. మితభాషి అతిహాయి, అతిభాషి యతిహాని అనికదా! భగవాన్ ఉవాచ.

**65.** సత్యాన్ని మించిన స్థానమే లేదు :

**సత్యమేవేశ్వరో లోకే సత్యం పద్మాశ్రితా సదా।**

**సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తి పరంపదమ్॥** 109-13

సత్యమే దేవుడు, సిరిసంపదలు భోగభాగ్యాలు సత్యాన్నే ఆశ్రయిస్తాయి. మంచి విషయాలన్నీ సత్యం వల్లనే నిలబడతాయి. సత్యం కంటే గొప్ప స్థానం లేదు.

దేవుడెక్కడున్నాడు? ఇక్కడే ఈ లోకంలోనే భగవాన్ సత్య స్వరూపిగా ఉన్నారు. సత్యమెక్కడుంటే, సాక్షాత్ లక్ష్మి అక్కడ నివసిస్తుంది. అధికారం అక్కడ అందల మెక్కుతుంది. సత్యం వల్లనే, లోకంలో ఇంతో అంతో మంచి నిలబడుతున్నది. అన్నింటికంటే ఉత్తమమైంది, ఉన్నతమైంది, శాశ్వతమైందీ సత్య మొక్కటే.

**66.** ముగ్గురు గురువులు :

పురుషస్యేహ **జాతస్య భవన్తి** గురవస్త్రయః।

ఆచార్యశ్చైవ (కాకుత్థ్స) **పితా మాతా** చ (రాఘవ)॥ 111-2

ఈ లోకంలో పుట్టిన వాడికి ఉపాధ్యాయుడు, తండ్రి, తల్లి అని ముగ్గురు గురువులు.

తల్లే మనకందరికి మొట్టమొదటి గురువు. ఆమె చెబితేనే తండ్రిని గుర్తిం దాం. ఆమె నేర్పితేనే మాటలు నేర్చుకున్నాం. అందుకనే ఆమె నేర్పిన భాషను మాతృభాష అంటాం. ఆ తరువాత విద్యాబుద్ధులు నేర్పి, క్రమశిక్షణలో పెట్టి గురుకులానికి పంపినవాడు తండ్రి. అజ్ఞానాన్ని పోగొట్టి, సుజ్ఞానాన్ని అందించి కళ్ళు తెరిపించినవాడు ఆచార్యుడు. వ్యక్తిత్వాన్ని కలిగించి తీర్చిదిద్దినవాడు ఈయన. అందుకే శ్రుతి అంటుంది- 'మాతృ దేవో భవ' 'పితృ దేవో భవ' 'ఆచార్య దేవో భవ' అని.

**67. ఎలాంటివాడైనా; భర్తే దైవం :**

**దుఃశీలః కామవృత్తో వా ధనైర్వా పరివర్జితః।**
**స్త్రీణామార్యస్వభావానాం పరమం దైవతం పతిః॥ 117-22**

దుర్మార్గుడైనా, కామపరుడైనా, దరిద్రుడైనా, పతివ్రతలకు పతియే ప్రత్యక్ష దైవం.

ఏ స్థితిలోనైనా స్త్రీకి భర్తే దైవం. మంచివాడు కాకపోవచ్చు. పరస్త్రీ లోలుడే కావచ్చు. ధనధాన్యాలను, పదవులను పోగొట్టుకోవచ్చు, కాని పతివ్రత యైన సతి అతణ్ణి దైవంగానే భావిస్తుంది. అంతేగాని, ఇలాంటి వాడు నాకక్కర లేదు అని నిరాకరించదు. అదే భారతీయ మహిళల భావనలోని గొప్పదనం.

**68. ఆడపిల్లల తండ్రికి అంతే మర్యాద :**

**సదృశాచ్చాపకృష్టాచ్చ లోకే కన్యాపితా జనాత్।**
**ప్రధర్షణమవాప్నోతి శక్రేణాఽపి సమో భువి॥ 118-35**

ఆడపిల్లల తండ్రి దేవేంద్రునితో సమానుడైనా, తనకు సమానమైన వారి వల్ల, తనకంటే తక్కువ వారివల్ల బెదిరింపులకు గురికాక తప్పదు.

ఎంత గొప్పవాడైనా ఆడపిల్లను కన్నవాడు అణిగిమణిగి ఉండాల్సిందే. అవకాశం దొరికితే తనకంటే తక్కువవాళ్ళు, అతనితో సమానమైనవాళ్ళు కూడా అవమానించడానికి ప్రయత్నిస్తారు. ఈ సమాజం ఆడపిల్లల తండ్రికి అంతకంటే మర్యాద ఇవ్వలేదు.

# ఆరణ్యకాండ

**69. కామంవల్ల మూడు ప్రమాదాలు :**

**త్రీణ్యేవ వ్యసనాన్యత్ర కామజాని భవన్త్యుత।**
**మిథ్యావాక్యం పరమకం తస్మాద్గురుతరావుభౌ॥**
**పరదారాభిగమనం వినా వైరం చ రౌద్రతా। 9-3**

కామం కట్టలు తెంచుకున్న వాణ్ణిముచ్చటగా మూడు వ్యసనాలు వరిస్తాయి. అబద్ధాలాడటం అందులో మొదటిది. అంతకంటే భయంకరమైనవి మిగతా రెండు పరస్త్రీల కోసం పాకులాడటం, కారణం లేకుండానే ఇతరులతో శత్రుత్వం పెంచుకోవడం.

అంతశ్శత్రువుల్లో కామం మొదటిది. కామానికి లొంగిపోయినవాడు కన్నూ మిన్నూ కానకుండా ప్రవర్తిస్తాడు. పచ్చి అబద్ధాలాడటానికి చచ్చినా వెనుకాడడు. విషంతో సమానమైన విషయవాంఛలతో అదుపుతప్పి అల్లాడుతుంటాడు. అశాశ్వతమైన భౌతికసుఖాల కోసం అర్రులు చాస్తూ ఉంటాడు. కామంతో కళ్ళు కప్పుకుపోయి కనపడిన స్త్రీలందరూ కావాలంటాడు. పరస్త్రీవ్యామోహప్రవాహంలో పడికొట్టుకుపోతూ, చీటికిమాటికి చిర్రుబుర్రులాడుతుంటాడు. అనుమానపడుతూ అందరితోను విరోధం పెంచుకొంటాడు. కామాలు కనుమరుగైతేనేకాని హృదయం రామాలయం కాదు.

**70. ధర్మమూల మిదం జగత్ :**

**ధర్మాదర్థః ప్రభవతి ధర్మాత్ప్రభవతే సుఖమ్।**
**ధర్మేణ లభతే సర్వం ధర్మసార మిదం జగత్॥ 9-30**

ధర్మం వల్ల ధనధాన్యాలు సమకూరుతాయి. ధర్మంవల్ల సకలసౌఖ్యాలు సంభవిస్తాయి. ధర్మాచరణంతో ధరలో పొందలేనిది లేదు. ఈ జగత్తులో సారభూతమైంది ధర్మ మొక్కటే.

ధర్మమార్గంలో నడవటం ఒక గొప్ప సాధన. ఎన్ని కష్టాలెదురైనా ధైర్యంగా ధర్మం తప్పకుండా నిలబడాలి. అలాంటివాడికి ధనధాన్యాలకు, భోగ భాగ్యాలకు ఏ లోటూ ఉండదు. ప్రారంభంలో ఎన్ని ఇబ్బందులెదురైనా, చిట్ట చివరకు ధర్మంవల్ల శాశ్వతసుఖం కలుగుతుంది. ధర్మమార్గంలో అనుభవించే సుఖమే సుఖం. త్రికరణశుద్ధితో ధర్మాన్ని నమ్మితే పొందలేనిది ఏదీ లేదు.

అసలు ఈ ప్రపంచమే ధర్మంపైన ఆధారపడి నడుస్తున్నది. ధర్మం నశిస్తే ప్రపంచమే నశిస్తుంది. ధర్మాన్ని మనం కాపాడితే అది మనల్ని కాపాడుతుంది. 'ధనమూలమిదం జగత్' కాదు- 'ధర్మమూలమిదం జగత్' అని తెలుసుకోవాలి.

**71. బాగుంటేనే భామల మెప్పు :**

**ఏషాహి ప్రకృతిః స్త్రీణామాసృష్టేః (రఘునన్దన)।**
**సమస్థమనురజ్యన్తి విషమస్థం త్యజన్తిచ॥** 10-5

సిరిసంపదలతో తులతూగే వాడంటే స్త్రీలకెంతో ఆదరం. ఆర్థికంగా దెబ్బతిన్న అభాగ్యుణ్ణి వాళ్లు అరనిమిషంలో వదిలేస్తారు. ఇది సృష్ట్యాది నుంచి మహిళల్లో మార్పులేకుండా వస్తున్న స్వభావం.

భోగభాగ్యాలంటే అంగనలకు ఆసక్తి అధికం. సిరిగలవాడినే వాళ్లు చిత్తగిస్తారు. సిరి తప్పిపోయినవాణ్ణి చిన్నచూపు చూస్తారు. ఇది ఆడవాళ్లల్లో ఈనాడు మాత్రం కనపడే లక్షణం కాదు. అనాది కాలం నుంచి ఆడవాళ్ల స్వభావం అంతే. మనశ్చాంచల్యానికి మరో పేరు ఆడది. ఇది ఎక్కువమందిలో సాధారణంగా కనపడే సహజలక్షణమేగాని, స్త్రీజాతి అంతా ఇంతే అనడం కూడా అతిశయోక్తి కాకపోదు. అపవాదాలు అక్కడక్కడా లేకపోనూ లేదు.

**72. ఆడమనసుకు మూడు లక్షణాలు :**

**శతహ్రదానాం లోలత్వం శస్త్రాణాం తీక్ష్ణతాం తథా।**
**గరుడానిలయోః శైఘ్ర్యమనుగచ్ఛన్తి యోషితః॥** 13-6

మెరుపు తీగల్లోని చాంచల్యం, చురకత్తుల్లోని చురుకుదనం, వాయుదేవుడు-గరుత్మంతుల వర్ణనాతీతమైన వేగం, ఈ మూడూ ఆడవాళ్ల మనసులో ఉన్నాయి.

నిలిచినచోట నిలవకుండా ఎక్కడెక్కడో తిరుగుతూ అతిచంచలంగా ఉంటుంది అతివల మనసు. సర్వకాల సర్వావస్థల్లోను మెత్తగా ఉన్నట్టే ఉండి హఠాత్తుగా కత్తిమొనకున్నంత చురుకు ఈ చాంచల్యానికి ఎప్పుడూ తోడుగా ఉంటుంది. లోకంలో అతివేగంగా వెళ్లగలవాడు వాయుదేవుడు. అతణ్ణి మించినవాడు గరుత్మంతుడు. మానవతుల మనోవేగం ఈ ఇద్దఱి వేగానికి ఎందులోనూ తీసిపోదు. ఎవరూ పట్టలేనంత వేగంగా పరుగెత్తే స్వభావం వాళ్ల మనస్సుకు సహజం. అందువల్లే ఆడమనసు, తీసుకున్న నిర్ణయాలకు నిలబడలేదు. అనుమానాలను ఆపుకోలేదు. నిదానంగా ఆలోచించలేదు.

**73. ప్రజలను భయ పెట్టే ప్రభువు నిలవడు :**

**ఉద్వేజనీయో భూతానాం నృశంసః పాపకర్మకృత్।**
**త్రయాణామపి లోకానామీశ్వరోఽపి న తిష్ఠతి॥** 29-3

మంచీచెడూ లేకుండా ప్రజలను వంచించి భయపెట్టేవాడు, పట్టు విడుపూ లేకుండా తను పట్టినపట్టు విడవనివాడు, పాపిష్ఠి పనులు చేసేవాడు, ముల్లోకాలకు ఏలికైనా ఎక్కువ కాలం నిలబడడు.

శక్తికి మించిన పన్ను వేయడం, తప్పుకు మించిన శిక్ష వేయడం, ప్రాధేయపడినా ప్రాణాలను కాపాడకపోవడం, మొ॥ లక్షణాలున్న రాజు ఎన్ని లోకాలకు పాలకుడైనా ప్రజలు సహించరు. అవకాశం కోసం ఎదురు చూస్తుంటారు. అన్నీ కలిసొస్తే పదవీ భ్రష్టుణ్ణి చేస్తారు. అందువల్ల ప్రజల ప్రమోదాన్ని ప్రభువు ఆశించాలి. ధర్మం తప్పకుండా దయతో పాలించాలి శాంతి భద్రతలు చక్కగా కాపాడాలి.

**74. రావలసింది రానే వస్తుంది :**

**అవశ్యం లభతేజన్తుః ఫలం పాపస్య కర్మణః।**
**ఘోరం పర్యాగతే కాలే ద్రుమాః పుష్పమివార్తవమ్॥** 29-8

పాపిష్ఠి పనులు చేసేవాళ్ళు భయంకరమైన ఫలితాలను ఎప్పటికైనా అనుభవించి తీరుతారు. ఎప్పుడో నీళ్ళు తాగిన చెట్టు ఏదో ఒక రోజున పూలుపూసే తీరుతుంది.

ఎవరికీ తెలియకుండా ఎన్నో పాపాలు చేయవచ్చు, కానీ చేసుకున్నంతా ఒకనాటికి అనుభవించే తీరాలి. మంచైనా అంతే చెడైనా అంతే. సుఖమైనా దుఃఖమైనా మనకు రావలసింది రావలసినప్పుడు వచ్చే తీరుతుంది. రావద్దన్నా ఆగేదీ లేదు; రమ్మని ఎదురు చూసినా వచ్చేదీలేదు. కాబట్టి పని చేసేటప్పుడు మంచిచెడ్డలను ఆలోచించుకోవాలే గాని, చేసేసిన తరువాత మన చేతుల్లో ఏమీ ఉండదు. ఫలితం మాత్రం మనకోసం ఎదురు చూస్తుంటుంది. చెట్లు నీళ్లెప్పుడు తాగుతాయో ఎవ్వరికీ తెలియదు. కాని పూలు పూసే రోజులు రావడంతోటే పుష్పించి తీరుతాయి.

**75. మదించిన మహీపతిని ఎవ్వరూ మన్నించరు :**

**సక్తం గ్రామ్యేషు భోగేషు కామవృత్తం మహీపతిమ్।**
**లుబ్ధం న బహుమన్యన్తే శ్మశానాగ్నిమివ ప్రజాః॥** 33-3

విషయ వాంఛలతో భౌతిక భోగాలకు బానిన అయినవాడు, యథేచ్ఛగా సంచరించేవాడు, పిల్లికి కూడా బిచ్చం పెట్టనివాడు అయిన ప్రభువును ప్రజలు మన్నించరు. సేవించడానికి అనర్హమైన శ్మశానాగ్నిలాగా దూరంగా పెడతారు.

ప్రజల మంచి చెడ్డలను విచారించకుండా మద్యపానంతో మదమత్తుడై, వారకాంతల ఒయ్యారాలకు దాసుడై, దయా ధర్మం లేకుండా లుబ్ధుడై మోడు వారిన చెట్టులాగా, శ్మశానాగ్నిలాగా మిగిలిపోయిన రాజును రాజ్యంలో ఎవరూ గౌరవించరు. అదును చూసి పడగొడతారు. తన సుఖం కంటే తన ప్రజల సుఖమే నరపతికి లక్ష్యం కావాలి. స్వార్థంకంటే పరార్థం మీదనే అతని దృష్టి ఉండాలి. అశాశ్వతమైన భౌతికసుఖాలకంటే అభౌతికమైన ఆనందంపైనే అతని అంతరంగం కేంద్రీకృతం కావాలి.

**76. అదునులో చేయకపోతే అంతా గందరగోళమే :**

**స్వయం కార్యాణి యం కాలే నానుతిష్ఠతి పార్థివః।**
**స తు వై సహ రాజ్యేన తైశ్చ కార్యైర్వినశ్యతి॥** 33-4

సకాలంలో సక్రమంగా తన విధులను నిర్వర్తించని రాజు తన రాజ్యాన్ని నిలబెట్టుకోలేడు. అకాలంలో మొదలు పెట్టిన, అనర్థదాయకమైన పనులు చివఱకు అతణ్ణే సర్వనాశనం చేస్తాయి.

ఏ పని ఎప్పుడు చేస్తే బాగుంటుందో బాగా ఆలోచించి చేయాలి. అలా అని అనువైన కాలాన్ని వృథా చేయకూడదు. అలాగే ఆలోచనారహితంగా తొందరపడి చేయనూ కూడదు. ఏతావతా ఏం తేలిందంటే; ప్రతి పనీ తగిన కాలంలోనే చేయాలి. తగిన ఆలోచనతో చేయాలని. అలా గనక చేయకపోతే అంతా గందరగోళమే అయిపోతుంది. ప్రజల వాడిని పసికట్టకుండా ప్రభువు తనకు నచ్చింది గదా అని రాజ్యంలో ఒక సంస్కరణ చేస్తే అది అతణ్ణి ప్రభుత్వాన్ని కూడా పతనం చేస్తుంది. అలాగే యజమాని తన కుటుంబ సభ్యుల ఆలోచనలకు, అభీష్టాలకు పూర్తి వ్యతిరేకంగా ఒక నిర్ణయాన్ని తీసుకుంటే; అది ఆ కుటుంబంలో చిచ్చు రేపుతుంది. మంచి ఆలోచనైనా మంచి సమయంలో

చేస్తేనే ఫలిస్తుంది. 'కాలే ఖలు సమారబ్ధాః ఫలం పుష్యన్తి నీతయః' అని కదా పెద్దలంటారు.

**77. కష్టాల్లో కన్నెత్తైనా చూడరు :**

**తీక్ష్ణమల్ప ప్రదాతారం ప్రమత్తం గర్వితం శఠమ్।**
**వ్యసనే సర్వభూతాని నాభిధావన్తి పార్థివమ్॥** 33-15

తీవ్ర స్వభావం కలవాడు, పరమ లోభి, మదమత్తుడు, గర్వాంధుడు. మూర్ఖుడు అయిన పరిపాలకుణ్ణి కష్టంలో ఉన్నప్పుడు ప్రజలు కలుగజేసుకోరు.

ప్రజలతో రాజు ఎంత జాగ్రత్తగానో వ్యవహరించాలి. తనపైన ఏ కారణంగానైనా దురభిప్రాయం రాకుండా చూచుకోవాలి. వాళ్ళతో మృదువుగా మాట్లాడుతూ, కావలసిందానికంటే ఎక్కువగా ఇస్తూ ఉంటే, వాళ్ళ ప్రేమాభిమానాలను చూరగొనవచ్చు. వ్యసనాలకు బానిసగా మారి, గర్వాంధుడై ప్రజలను దూరం చేసుకున్న మూర్ఖుడు ఏదైనా క్లిష్టపరిస్థితిలో చిక్కుకున్నప్పుడు, వాళ్ళ సానుభూతి పొందలేడు. ప్రజాబలం లేకపోతే పరిపాలనే అస్తవ్యస్తమౌతుంది.

**78. తనవాడే తాట ఒలిచేస్తాడు :**

**అతిమానిన మగ్రాహ్యమాత్మ సంభావితం నరమ్।**
**క్రోధినం వ్యసనే హన్తి స్వజనోఽపి మహీపతిమ్॥** 33-16

దురభిమానాన్ని పెంచుకున్నవాడు, అందుబాటులో ఉండనివాడు, తన గొప్పలు తానే చెప్పుకొనేవాడు, క్రోధంతో చిందులు వేసేవాడు అయిన నరపతిని స్వపక్షీయులు కూడా సమయం చూచి దెబ్బతీస్తారు.

కొందరు నాయకులకు తమమీద చెప్పలేనంత దురభిమానముంటుంది. తాము సాక్షాత్తు అవతార పురుషులమని, కారణజన్ములమని గొప్పలు చెప్పుకోవడం వారికి సరదా. ప్రజలు కష్టాలు విన్నవించుకోవాలని ఎప్పుడు చూసినా ఏదో ఒక సాకుతో వాళ్ళకు దర్శనమివ్వరు. స్వపక్షీయుల్ని అనుమానించడం, పదేపదే అవమానించడం పీళ్లకు పరిపాటి. ఇలాంటి వాళ్లను దెబ్బతీయడానికి సమయం, సందర్భం ఎప్పుడు దొరుకుతాయా అని తనవాళ్ళే కాసుకొని కూచుంటారు. అవసరమైతే, శత్రువుతో చేయి కలిపైనా సరే ప్రభుత్వాన్ని పడగొట్టడానికి ప్రయత్నిస్తుంటారు. కనుక రాజు తన వైఖరిని మార్చుకొని దురభి

మానాన్ని వదిలి, ప్రజలకందుబాటులో ఉండి. వాళ్ళ సమస్యలను విచారించి పరిష్కరించాలి.

## 79. గద్దె దిగితే గడ్డిపరకతో సమానం :

> నానుతిష్ఠతి కార్యాణి భయేషు నబిభేతి చ।
> క్షిప్రం రాజ్యాచ్చ్యుతో దీనస్తృణైస్తుల్యో భవిష్యతి॥ 33-17

తన విధులను సక్రమంగా నిర్వహించకపోవడం వల్ల, భయపడవలసిన సందర్భాలను తేలికగా తీసిపారేయడంవల్ల ఏ రాజైనా పదవిని పోగొట్టుకుంటాడు. రాజ్యంపోయిన ఆ దీనుడు గడ్డిపరకతో సమానం.

పదవి ఉన్నంతవరకే ప్రభువుకు గౌరవం. పదవిని చూసుకొని విఱ్ఱవీగి ప్రజలను దూరం చేసుకొంటారు కొందఱు. రాజుగా రాజ్యానికి తను ఎప్పుడు ఏం చేయాలో మంత్రిమండలిలో చక్కగా చర్చించి, గుణదోషాలను విచారించి వాటిని అమలు చేయాలి. శత్రువుల పన్నాగాలను గూఢచారుల ద్వారా గమనిస్తూ వాటికి ప్రతీకారాలను ఆలోచించి పెట్టుకోవాలి. మంత్రులు సలహా ఇచ్చినా దాన్ని లెక్కపెట్టకుండా స్వతంత్రంగా, లెక్కలేనితనంతో వ్యవహరిస్తే పదభ్రష్టుడౌతాడు. గద్దెదిగిపోయిన నాయకుణ్ణి ప్రజలు గడ్డిపరక కంటే హీనంగాచూస్తారు. కనుక ముందు జాగ్రత్త అందరికీ అవసరమే.

## 80. పదవిపోతే పనికేరాడు :

> శుష్కైః కాష్ఠైర్భవేత్కార్యం లోష్టైరపి చ పాంసుభిః।
> న తు స్థానాత్పరిభ్రష్టైః కార్యం స్యాద్వసుధాధిపైః॥ 33-18

ఎండిపోయిన కట్టెలవల్ల, కొబ్బరిపీచువల్ల, మట్టిదుమ్మువల్ల కూడా ఈ లోకానికి ఏదో ఒక ప్రయోజనం ఉంటుంది. కాని రాజ్యాలు పోగొట్టుకున్న రాజులవల్ల ఈ లోకానికి ఏ లాభమూ ఉండదు.

పదభ్రష్టుడైన రాజు పైసాకు పనికిరాడు. ఈ లోకంలో కట్టెలు, కొబ్బరిపీచు ఎండిపోయినా బాగా ఉపయోగిస్తాయి దుమ్ము కూడా బాగా నలిగిపోతే ఏ పనికైనా ఉపయోగపడుతుంది. ఒక్కసారి పదవి పోగొట్టుకున్నవాడు ఏ పనికీ ఉపయోగించడు. అప్పటికే వాడు అహంకారం పెంచుకొని అలా చెడి

పోతాడు ఈ అదిరిపాట్లన్నీ పదవిలో ఉన్నంతవఱకే. అందుకే ''అధికారాంతము నందు చూడవలదా ఆ అయ్య సౌభాగ్యముల్'' అని అంటారు పెద్దలు.

81. ఆ రాజుకు ధోకా లేదు :

అప్రమత్తశ్చ యో రాజా సర్వజ్ఞో విజితేన్ద్రియః।
కృతజ్ఞో ధర్మశీలశ్చ స రాజా తిష్ఠతే చిరమ్॥ 33-20

లోపల బయట ఏం జరుగుతున్నదో జాగ్రత్తగా గమనించేవాడు. అన్ని విషయాలు తెలిసినవాడు, ఇంద్రియ నిగ్రహమున్నవాడు, కృతజ్ఞతా భావం కల వాడు, ధార్మికుడు అయిన అధిపతి పదికాలాల పాటు రాజ్యం చేయగలుగుతాడు.

అప్రమత్తుడై తన రాజ్యంలోను, ప్రక్క రాజ్యంలోను ఏం జరుగుతున్నదో బాగా గమనిస్తూ ఉండాలి. ఎప్పటికప్పుడు గూఢచారుల ద్వారా అన్ని విషయాలను తెలుసుకోవాలి. ఇంద్రియలోలుడై వ్యసనాల్లో తగులోక్క కూడదు. తనకు ఉపకారం చేసిన వాళ్ళ విషయంలో నిరంతరం కృతజ్ఞుడుగా ఉండాలి. త్రికరణ శుద్ధిగా ధర్మాన్ని సేవించాలి. అలా ఉండే రాజు ప్రజల అనురాగాన్ని ఆప్యాయతను చూరగొంటాడు. శత్రువులు రాజ్యం కూలదోయడానికి ప్రయత్నం చెయ్యలేరు. ఆ రాజ్యం పడిపోదు. ఆ రాజుకు ఎప్పటికీ ధోకా ఉండదు.

82. కళ్లు మూసినా మెలకువగా ఉండాలి :

నయనాభ్యాం ప్రసుప్తోఽపి జాగర్తి నయచక్షుషా।
వ్యక్తక్రోధ ప్రసాదశ్చ స రాజా పూజ్యతే జనైః॥ 33-21

కళ్ళు మూసుకొని నిద్రపోతూ ఉన్నా, నీతి నేత్రంతో మెళకువగానే ఉండాలి. ఆగ్రహానుగ్రహాలు అందరికీ ఆమోద యోగ్యంగా ఉండాలి. అలా ఉన్న రాజు అందఱిచేత గౌరవింపబడతాడు.

భౌతికమైన నేత్రాలతో నిద్రపోతున్నట్లు కనపడినా; రాజనీతి అనే నేత్రం మాత్రం ఎప్పుడూ తెరిచే ఉండాలి. అంటే మానసికంగా చాలా చురుకుగా ఉండి గూఢచారి వ్యవస్థను కట్టుదిట్టంగా ఉంచుకోవాలి. ఆగ్రహం గాని, అనుగ్రహం గాని సకారణంగా ఉండి, ప్రజలకు కూడా ఆమోద యోగ్యంగా ఉండాలి. శిక్షించినా, రక్షించినా ప్రభువు తగిన కారణముంటేనే చేస్తాడనే విశ్వాసాన్ని ప్రజల్లో పెంచుకోవాలి. అలాంటి రాజు రాష్ట్రంలోను, బయట కూడా భయ భక్తులను నిలబెట్టగలుగుతాడు. స్థిరంగా రాజ్యాన్ని పరిపాలిస్తాడు.

**83. చెప్పేవాడు వినేవాడు లేడు :**

**సులభాః పురుషా (రాజన్) సతతం ప్రియవాదినః।**
**అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః** 37-2

తియ్యగా మాట్లాడి మెప్పించేవాళ్ళు ఎక్కడపడితే అక్కడే దొరుకుతారు. వాళ్ళు జనాన్ని ఆకర్షిస్తారు. కఠినమైనప్పటికి మంచి మాటను చెప్పేవాళ్ళు గాని, వినేవాళ్ళుగాని ఎక్కడా ఎవరూ లేరు.

తియ్యగా మాట్లాడి తమ పబ్బం గడుపుకొనేవాళ్ళు రాజులచుట్టూ ఎందఱో ఉంటారు. వాళ్ళు రాజును తప్పుదోవ పట్టిస్తారు. కాని కఠినంగా మాట్లాడినా రాజుకు హితమైన మాటను చెప్పాలనుకొనేవాళ్ళు చాలా తక్కువమంది ఉంటారు. ధైర్యంగా వాళ్ళు చెప్పినా, ఆగ్రహించకుండా విని సరిగా అర్థంచేసుకొనే రాజులు కూడా ఉండనే ఉండరు. ఎప్పుడూ ప్రియమైన మాటలతో తమను పొగిడేవాళ్ళనే రాజులు దగ్గఱకు రానిస్తారు; చుట్టూ కూర్చోబెట్టుకుంటారు. మంచిమాటలు చెప్పేవాళ్ళను పంచలో నిలవనీయరు.

**84. పాపితో చేరితే ఆపదలు తప్పవు :**

**అకుర్వన్తోఽపి పాపాని శుచయః పాపసంశ్రయాత్।**
**పరపాపైర్వినశ్యన్తి మత్స్యా నాగహ్రదే యథా॥** 38-26

మంచివాళ్ళు స్వయంగా పాపాలు చెయ్యకపోయినా పాపులతో చేరడం వల్ల వాళ్ళ పాపాలకు గురై, పాముల కొలనులో పడిన చేపల్లాగా నశించిపోతారు.

కొంతమంది సజ్జనులు అమాయకంగా యోగ్యతా యోగ్యతలు తెలియకుండా వంచకులతో చేరి చెడిపోతారు. సహజంగా వాళ్ళు ఏ పాపం ఎఱుగకపోయినా పాపిష్ఠివాళ్ళ పంచన జేరటంవల్ల వాళ్ళ పాపాలు వీళ్ళకు చుట్టుకొని శిక్షార్హులౌతారు. పాములున్న కొలనులో చేపలువెళ్ళి పడితే ఆ పాములను చంపే ప్రయత్నంలో చేపలు కూడా చచ్చిపోతాయి. అందువల్ల అవతలవాళ్ళ యోగ్యతా యోగ్యతల్ని, మంచి చెడ్డలను గమనించి వాళ్ళతో స్నేహం చేయాలి. లేకపోతే మంచివాళ్ళకు కూడా ఆపదలు తప్పవు.

**85. అంతకంటే పాపం లేదు :**

పరదారాభిమర్శాత్తు నాన్యత్పాపతరం మహత్ 138-30

పరస్త్రీల కోసం పాకులాడటం కంటే గొప్ప పాపం ఇంకోటిలేదు. పరస్త్రీని తల్లిగా చూడమని భారతీయ ధర్మశాస్త్రం చెబుతున్నది. ఇంకొకరి అర్ధాంగి అయిన స్త్రీని కన్నెత్తైనా చూడకూడదు. అలా కాకపోతే ఈ సమాజ వ్యవస్థ వికృతమైపోయి, జాతి జీవనానికి ప్రతిష్టంభన ఏర్పడుతుంది. మానవ జాతి మనుగడకే ముప్పు వాటిల్లుతుంది. జాతి వినాశానికి దోవతీసే ఇలాంటి పనికంటే గొప్ప పాపం ఏముంటుంది ?

**86. తోడేలు చేతుల్లో మేకలు బతుకుతాయా ?**

> **స్వామినా ప్రతికూలేన ప్రజా_స్తీక్ష్ణేన (రావణ)।**
> **రక్ష్యమాణా న వర్ధ_న్తే మేషా గోమాయునా యథా॥ 41-14**

దయాదాక్షిణ్యాలు లేకుండా, అతి కఠినంగా ప్రజల అభీష్టానికి విరుద్ధంగా ప్రభుత్వం నడుస్తుంటే; వాళ్ళకు రక్షణ ఎలా ఉంటుంది? తోడేలు చేతుల్లో మేకలు క్షేమంగా ఎలా ఉంటాయి ?

పరిపాలన ప్రజల అభీష్టాలకు అనుగుణంగా ఉండాలి. నిరంకుశంగా ఉండకూడదు. ప్రజలను రక్షించడానికి శ్రద్ధ తీసుకోవలసిన ప్రభువులు, వాళ్ళ స్వాతంత్ర్యాన్ని అపహరించి, నిర్దాక్షిణ్యంగా, కఠినంగా కక్ష తీర్చుకోవడానికి పూనుకోకూడదు. అలాంటి నిరంకుశ పరిపాలనలో నీతి నిజాయితీలను నమ్ముకున్న ప్రజలు నిట్టూర్పులు విడుస్తూ జీవచ్ఛవాల్లాగా, బ్రతుకు భారంగా గడుపుతుంటారు. రాష్ట్రాభివృద్ధి రవ్వంతకూడా ఉండదు. తోడేలు చేతుల్లో మేక పిల్లలను పెడితే అవి ఎలా బతికి బయటపడతాయి ? కనుక ప్రభువులు ప్రజలపై ప్రసన్నులుగా ఉంటేనే రాష్ట్రం సర్వతోముఖాభివృద్ధిని చెందుతుంది.

**87. దేనికైనా పాపం పండాలి :**

> **నను సద్యోఽవినీతస్య దృశ్యతే కర్మణః ఫలమ్।**
> **కాలోఽప్యంగీభవత్యత్ర సస్యానామివ ప_క్తయే॥ 49-27**

తప్పుచేసిన వాడికి ఫలితం వెంటనే కనపడదు. నాటిన పైరు పండటానికి కూడా కొంతకాలం జరిగితీరాలి.

చాలామంది అడుగుతుంటారు– 'వాడు అన్ని పాపాలు చేస్తున్నాడు కదా! భగవంతుడు వాణ్ణి ఏమీ శిక్షించడేం ?' అని. ఇంకొంతమంది అంటారు- 'అన్ని తప్పుడుపనులు చేసినా వాడు చూడండి! ఎంత హాయిగా ఉన్నాడో' అని. అంటే

పొరపాటు పనులు చేస్తే గాని ఈ లోకంలో సుఖంగా ఉండటం కుదరదేమో నని మధ్యస్థులు కొందఱు అనుకోవడం కూడా ఉంది. కాని నిజమాలోచిస్తే ఇవ్వేవీ సరైన ఆలోచనలు కావు. చేసిన పాపం అనుభవించకుండా ఎన్నటికీ తీరదు. కానీ అది పండటానికి కొంతకాలం అవసరమవుతుంది. పొలంలో నాటిన పైరు అప్పటికప్పుడే పండి పంటనిస్తుందా ? కొన్ని నెలలు గడవాలి. అప్పుడు పంటనిస్తుంది. అలాగే కొంతకాలం గడిస్తే పాపం పండి వాణ్ణి అనుభవింప జేస్తుంది. పాపం పండాలంటే దానికి కాలం కూడా సహకరించాలి.

**88. పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతోగాని పోదు :**

> కామం స్వభావో యో యస్య న శక్యః పరిమార్జితుమ్।
> న హి దుష్టాత్మనామార్య మా వసత్యాలయే చిరమ్॥ 50-11

సహజంగా వచ్చిన స్వభావాన్ని మార్చివేయడం మనం అనుకున్నంత తేలికకాదు. దుర్మార్గుల ఆశ్రయంలో లక్ష్మి ఎంతో కాలం నిలవుండదు.

'స్వభావో దురతిక్రమః' అంటారు. ఎన్నెన్ని జన్మల సంస్కారాలో మానవుడి వెంట పడి వస్తుంటాయి. ఆ సంస్కారాలను ఇతరులు మార్చడం అంత తేలికైన పనికాదు. దురదగొండి ఆకును ఎన్ని శుద్ధులు చేసినా దాంట్లో దురదను కలిగించే గుణం పోదు. అలాగే ఆజన్మసిద్ధమైన స్వభావం జన్మాంతం వఱకు మానవుణ్ని వదిలిపెట్టదు. వాడంతటవాడే దాన్ని మార్చుకోవడానికి తీవ్ర ప్రయత్నం చేస్తే ఇప్పుడు కాకపోయినా, ముందుముందైనా మారే అవకాశం ఉంటుంది. దుర్మార్గుల కబంధహస్తాల్లో లక్ష్మీదేవి ఎక్కువకాలం నిలబడదు. వాడిలోని దుష్టగుణాలను లోకానికి చాటి చెప్పి, వదిలేసి వెళ్లిపోతుంది.

**89. తలకు మించిన తలగుడ్డ :**

> స భారః సౌమ్య! భర్తవ్యో యో నరం నావసాదయేత్।
> తదన్నమపి భోక్తవ్యం జీర్యతే యదనామయమ్॥ 50-27

మోయగలిగినంత బరువునే మోయాలి. కుప్పకూల్చేటంత బరువును కోరి నెత్తికెత్తుకోకూడదు. అనారోగ్యాన్నివ్వకుండా జీర్ణమయ్యేటంత ఆహారాన్నే స్వీకరించాలి

చేయలేని పనిని నెత్తినెట్టుకొని మధ్యలో చేతులెత్తకూడదు. తన అర్హతను, బరువు బాధ్యతలను బాగా ఆలోచించే ఏ పనినైనా అంగీకరించాలి. కార్యభారా

నికి కుప్పకూలిపోయేటట్లైతే మొదట్లోనే దాన్ని తిరస్కరించివేయాలి. తను ఎంత జీర్ణం చేసుకోగలడో అంతే ఆహారాన్ని తీసుకోవాలి. ఎక్కువగా ఉన్న పదార్థం గదా! అని ఎక్కువగా తింటే మొదటికే మోసంవచ్చి మంచం పట్టాల్సి వస్తుంది. తినే పదార్థం మంచి చెడ్డల్ని, మన శక్తి సామర్థ్యాలను బాగా ఆలోచించుకునే తినాలి. తిన్న తరువాత బాధపడితే తీర్చేవారెవరూ ఉండరు. 'హితం మితం భుంజీత' అని గదా పెద్దలమాట!

**90. చావబోయేవాడికి చక్కటి మాటలు రుచించవు :**

> మృత్యుకాలే యథా మృత్యోర్విపరీతాని సేవతే,
> ముమూర్షూణాం హి సర్వేషాం యత్పథ్యం తన్నరోచతే॥
> 53-17

మరణ మాసన్నమైన వాడు మంచి మాటలు చెవిని పెట్టడు. పిచ్చి పిచ్చి పనులు హెచ్చుగా చేస్తుంటాడు.

చావబోయే ముందు చక్కటి మాటలెన్ని చెప్పినా వాడికి నచ్చనే నచ్చవు. 'వినాశకాలే విపరీతబుద్ధిః' అంటారు పెద్దలు. వినాశం దాపురించినప్పుడు విజ్ఞుల మాటలు వినిపించవు. మరణమాసన్నమైనప్పుడు మంచిచెడ్డలను గురించి ఎవరైనా చెబితే వాణ్ణి లెక్క పెట్టడు. వాడి మాటలు, మనస్సు వక్రంగా పోతాయేగాని సక్రమంగా ఉండవు. 'బుద్ధిః కర్మానుసారిణీ' అని కదా ఆర్యోక్తి!

# కిష్కిన్ధాకాండ

**91. అతిస్నేహం అనర్థదాయకం :**

> స్మృత్వా వియోగజం దుఃఖం త్యజ స్నేహం ప్రియేజనే
> అతిస్నేహ పరిష్వంగా ద్వర్తిరార్ద్రాఽపి దహ్యతే॥ 1-115

ఎడబాటులో కలిగే దుఃఖాన్ని జ్ఞాపకం చేసుకొని ప్రేమపాత్రులపై స్నేహానుబంధాన్ని నెమ్మదినెమ్మదిగా వదిలిపెట్టాలి. స్నేహ మెక్కువ కావడం వల్లనే తడిసిపోయిన వత్తి కూడా తగులబడిపోతున్నది.

మమకారం పెంచుకొనేకొద్దీ మనకు మరిన్ని కష్టాలు తప్పవు. 'నా భార్య, నా పిల్లలు, నా బంధువు, నా స్నేహితుడు' అని అనుబంధం పెంచుకొంటే

వాళ్ళకేదైనా అనిష్టం కలిగినప్పుడు అలమటించిపోవలసివస్తుంది. వాళ్ళతో ఎడబాటు కలిగినపుడు భరించలేని బాధను అనుభవించాల్సివస్తుంది. అందుకనే ఆ బాధను గుర్తించుకొని వాళ్ళపైన కలిగిన మమకారాన్ని తగ్గించుకొంటూ పోవాలి. అలా అభ్యాసం చేయగా చేయగా ఒకనాటికి కొంతవరకు అది తగ్గుముఖం పడుతుంది. అతి స్నేహంవల్ల దీపంలో వత్తి తగులబడిపోయినట్లు మానవుడూ మసైపోతాడు. స్నేహమనే పదానికి మైత్రి, నూనె అని రెండర్థాలు.

**92. ఉత్సాహంతో దేనైనా సాధించవచ్చు :**

> ఉత్సాహో బలవానార్య నాస్త్యుత్సాహాత్పరం బలమ్।
> సోత్సాహస్యాస్తి లోకేఽస్మిన్న కించిదపి దుర్లభమ్॥ 1-122

ఉత్సాహమే మానవుడికి మహాబలం. ఉత్సాహాన్ని మించిన బలమే లేదు. ఉత్సాహమున్నవాడు సాధించలేనిది ఈ లోకంలో ఏదీ లేదు.

మానవుడికున్న బలమంతా ఉత్సాహమే. ఉత్సాహం లేనివాడు మిగతా ఎన్ని ఉన్నా ఈ లోకంలో ఏమీ సాధించలేడు. మనిషిలో ఉత్సాహం గనక ఉంటే, కారణ సామగ్రి సరిగా లేకపోయినా ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగిపోయి, అఖండమైన విజయాన్ని సాధించగలుగుతాడు. ఈ లోకంలో ఉత్సాహశక్తిగలవాడికి దుర్లభమైంది ఏదీలేదు. కనుక నిరుత్సాహానికి అవకాశమివ్వకుండా ఎలాంటి విపత్కర పరిస్థితిలోనైనా ప్రతివాడు దైవంమీద భారంవేసి ఉత్సాహంతో ముందుకు పోవటం అలవాటు చేసుకోవాలి.

**93. వివేకముంటే వినాశం తప్పుతుంది :**

> వ్యసనే వాఽర్థకృచ్ఛ్రేవా భయే వా జీవితాన్తకే।
> విమృశన్వై స్వయా బుద్ధ్యా ధృతిమాన్నావసీదతి॥ 7-9

ధీరుడు కష్టకాలంలోగాని, ధననాశంలోగాని, ఎలాంటి భయంలోగాని, చిట్టచివరకు ప్రాణాలు పోయేటప్పుడుగాని వివేకంతో విచారణచేసి బయటపడతాడు. వాటిల్లో చిక్కుకొని ఎన్నటికీ నశించడు.

ఎలాంటి కష్టాలు సంభవించినా, సంకట పరిస్థితులు చుట్టుముట్టినా, నిబ్బరంగా నిండుగా నిలబడాలి. వాటిని చక్కగా విశ్లేషణ చేసి వివేకంతో పరిశీలించి కార్యకారణ విచారం చేసి ప్రతీకారాన్ని ఆలోచించాలి. ధైర్యంగా, దక్షతతో ఎదిరించటానికి ప్రయత్నించాలి. కాలం ఎప్పుడూ ఒకే రకంగా ఉండదు. ఆకాశాన్ని మేఘాలు ఆవరిస్తాయి. కారుచీకట్లు కమ్ముకుంటాయి. కానీ

శాశ్వతంగా అదే వాతావరణం ఉండదు. సదయాదే మేఘాలు నడిచి యెటో పోతాయి. ఆకాశం నిర్మలంగా ప్రకాశిస్తుంది. మనకొచ్చే కష్టాలు అలాంటివే. ఒకప్పుడు ఆరోగ్యం బాగుండదు. ఇంకొకప్పుడు ఆర్థికంగా ఇబ్బందులు. మరొకప్పుడు మనశ్శాంతి లోపిస్తుంది. కాని వేటికీ మనం చలించకూడదు. నిశ్చలంగా ధీరస్వభావంతో నిలబడాలి. వివేకంతో ఎదుర్కోవాలి. అప్పుడే చికాకులన్నీ పక్కకు పారిపోతాయి.

## 94. సోమరితనానికి శోకం తప్పదు :

> బాలిశస్తు నరో నిత్యం వైక్లబ్యం యోఽనువర్తతే
> స మజ్జత్యవశః శోకే భారాక్రాన్తేవ నౌర్జలే॥ 7-10

ధైర్యోత్సాహాలు లేకుండా అన్నింటికీ భయపడేవాడు బరువెక్కువైన నావ నట్టనడిసముద్రంలో మునిగినట్లు శోకసాగరంలో మునిగిపోతాడు.

పిరికితనం మనిషిని పిచ్చివాణ్ణి చేస్తుంది. ఈ లోకంలో పిరికివాడు తెచ్చుకోలేని అనర్థం లేదు. కష్టాలు వస్తాయి. కన్నీళ్ళను రప్పిస్తాయి. అంత మాత్రంచేత మనిషి తన వ్యక్తిత్వాన్ని కోల్పోకూడదు. ధైర్యాన్ని పెంచుకోవాలి. ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని సమకూర్చుకోవాలి. పరిస్థితులను ఎదిరించాలి. అలా కాకపోతే ఎక్కువ బరువును మోసుకెళ్ళే ఓడ నడిసముద్రంలో మునిగి పోయినట్లు, వీడూ మునిగిపోవటం తథ్యం. అందుకే ధైర్యోత్సాహాలను ఎన్నటికీ వదులుకోకూడదు.

## 95. స్నేహితుని కోసం ఏమైనా ఇవ్వచ్చు :

> ధనత్యాగః సుఖత్యాగః దేహత్యాగోఽపి వా పునః
> వయస్యార్థే ప్రవర్తన్తే స్నేహం దృష్ట్వా తథావిధమ్॥ 8-9

మిత్రునిపై నున్న స్నేహాభిమానాలతో డబ్బును, సుఖాన్ని, దేహాన్ని, సమస్తాన్ని వదులుకోవటానికైనా సిద్ధపడతారు మహాత్ములు.

త్యాగమే మహాత్ములకు ఊపిరి. సామాన్యంగా ఇతరులకు ఉపయోగం కలిగేటట్లైతే దేన్నైనా పరిత్యజించటానికి వారు సిద్ధపడతారు. అందులోను స్నేహితులకోసమైతే సిరిసంపదలను, సకల సుఖాలను- చిట్టచివరివరకు శరీరాన్ని కూడా త్యాగం చేయడానికి వాళ్ళు వెనుకాడరు. త్యాగమూర్తి దధీచి చూడండి! దేవకార్యం కోసం దేహాన్ని గడ్డిపరకలా వదిలేశాడు. త్యాగంలోనే సంతృప్తి

శాశ్వతంగా అదే వాతావరణం ఉండదు. నదయాడే మేఘాలు నడిచి యెటో పోతాయి. ఆకాశం నిర్మలంగా ప్రకాశిస్తుంది. మనకొచ్చే కష్టాలు అలాంటివే. ఒకప్పుడు ఆరోగ్యం బాగుండదు. ఇంకొకప్పుడు ఆర్థికంగా ఇబ్బందులు. మఱొకప్పుడు మనశ్శాంతి లోపిస్తుంది. కాని వేటికీ మనం చలించకూడదు. నిశ్చలంగా ధీరస్వభావంతో నిలబడాలి. వివేకంతో ఎదుర్కోవాలి. అప్పుడే చికాకులన్నీ పక్కకు పారిపోతాయి.

## 94. సోమరితనానికి శోకం తప్పదు :

బాలిశస్తు నరో నిత్యం వైక్లబ్యం యోఽనువర్తతే
స మజ్జత్యవశః శోకే భారాక్రాన్తేవ నౌర్జలే॥ 7-10

ధైర్యోత్సాహాలు లేకుండా అన్నింటికీ భయపడేవాడు బరువెక్కువైన నావ నట్టనడిసముద్రంలో మునిగినట్లు శోకసాగరంలో మునిగిపోతాడు.

పిరికితనం మనిషిని పిచ్చివాణ్ణి చేస్తుంది. ఈ లోకంలో పిరికివాడు తెచ్చుకోలేని అనర్థం లేదు. కష్టాలు వస్తాయి. కన్నీళ్ళను రప్పిస్తాయి. అంత మాత్రంచేత మనిషి తన వ్యక్తిత్వాన్ని కోల్పోకూడదు. ధైర్యాన్ని పెంచుకోవాలి. ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని సమకూర్చుకోవాలి. పరిస్థితులను ఎదిరించాలి. అలా కాకపోతే ఎక్కువ బరువును మోసుకెళ్ళే ఓడ నడిసముద్రంలో మునిగిపోయినట్లు, వీడూ మునిగిపోవటం తథ్యం. అందుకే ధైర్యోత్సాహాలను ఎన్నటికీ వదులుకోకూడదు.

## 95. స్నేహితుని కోసం ఏమైనా ఇవ్వచ్చు :

ధనత్యాగః సుఖత్యాగః దేహత్యాగోఽపి వా పునః
వయస్యార్థే ప్రవర్తన్తే స్నేహం దృష్ట్వా తథావిధమ్॥ 8-9

మిత్రునిపై నున్న స్నేహాభిమానాలతో డబ్బును, సుఖాన్ని, దేహాన్ని, సమస్తాన్ని వదులుకోవటానికైనా సిద్ధపడతారు మహాత్ములు.

త్యాగమే మహాత్ములకు ఊపిరి. సామాన్యంగా ఇతరులకు ఉపయోగం కలిగేటట్లైతే దేన్నైనా పరిత్యజించటానికి వారు సిద్ధపడతారు. అందులోను స్నేహితులకోసమైతే సిరిసంపదలను, సకల సుఖాలను- చిట్టచివరివరకు శరీరాన్ని కూడా త్యాగం చేయడానికి వాళ్ళు వెనుకాడరు. త్యాగమూర్తి దధీచి చూడండి! దేవకార్యం కోసం దేహాన్ని గడ్డిపరకలా వదిలేశాడు. త్యాగంలోనే సంతృప్తి

ఉంది. త్యాగంలోనే అమృతత్వం ఉంది. 'త్యాగేనైకే అమృతత్వమానశుః' అని పెద్దల మాట.

**96.** మిత్రుడు - శత్రువు :

ఉపకారఫలం మిత్రం అపకారోఽరి లక్షణమ్। 8-21

ఉపకారం చేయటం మిత్ర లక్షణమైతే, అపకారం చేయటం విరోధి లక్షణం.

కొందరు శక్తివంచనలేకుండా ఇతరులకు ఉపకారం చేయాలని అనుకుంటారు. అది వాళ్ళ సహజ స్వభావం. ఉపకారం ద్వారా అపరిచితులైన ఇద్దరి మధ్యలో స్నేహానుబంధం పెరుగుతుంది. ఇతరులకు అపకారం చేయడమే కొందరి స్వభావం. అపకారం ఇద్దరి మధ్యలో విరోధాన్ని పెంచుతుంది. అపకారం చేయకపోయినా, ఆ ఉద్దేశ్యం ఉన్నా ఇద్దరి మధ్యలో విరోధభావం పెరుగుతుంది. అందుకనే ఉపకారం మైత్రికి, అపకారం విరోధానికి మొదటి మెట్టు అవుతుంది.

**97.** ఏలికకుండాల్సిన ఎనిమిది గుణాలు :

దమః శమః క్షమా ధర్మోధృతిః సత్యం పరాక్రమః।
పార్థివానాం గుణా (రాజన్) దండ శ్చాప్యపరాధిషు॥ 17-17

దమం, శమం, ఓర్పు, ధర్మం. ధైర్యం, సత్యం, పరాక్రమం- అపరాధులను శిక్షించటం ఈ ఎనిమిది రాజులకుండవలసిన గుణాలు.

పరిపాలకులలో ఉండాల్సిన సద్గుణాలు కొన్నైనా ఉంటేనే పరిపాలన సక్రమంగా జరుగుతుంది. అందులో ముఖ్యంగా చక్కని వ్యక్తిత్వం రాజులకెంతో అవసరం. వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దేవి ఇంద్రియనిగ్రహం, మనోనిగ్రహం, ఓర్పు, ధర్మం, ధైర్యం, సత్యం అనే ఆరు గుణాలు రాజులకు అసాధారణమైన గుణాలు- రాజ్యాన్ని రక్షించడానికి, పరిపాలన సక్రమంగా నడవడానికి ఉపయోగించేవి- పరాక్రమం, అపరాధి శిక్షణం అనే రెండు- మొత్తం ఈ ఎనిమిది గుణాలు ప్రభువులో తప్పనిసరిగా ఉండాల్సినవి.

**98.** నరకానికి వెళ్ళే నల్గురు నరాధములు :

సూచకశ్చ కదర్యశ్చ మిత్రఘ్నో గురుతల్పగః।
లోకం పాపాత్మనామేతే గచ్ఛన్తే నాత్ర సంశయః॥ 17-35

చాడీలు చెప్పేవాడు, లోభి, మిత్రులను మోసంచేసేవాడు, గురుపత్నితో అక్రమ సంబంధం పెట్టుకొనేవాడు- ఈ నల్గురు నరలోకానికి వెడతారు. ఇందులో సందేహం లేదు.

మానవులలో ఉండే ప్రవృత్తులవల్లే, వాళ్ళకు ఉత్తమ లోకాలుగాని, నరక లోకాలుగాని సంప్రాప్తిస్తాయి. సత్ప్రవృత్తివల్ల మంచిలోకాలు, అసత్ప్రవృత్తి వల్ల నరకలోకాలు లభిస్తాయి ఒకరిమీద ఒకరికి కొండేలు చెప్పడం. ఎవ్వరికీ ఏమీ ఇవ్వకుండా అంతా తనకే కావాలనుకోవటం, ఉపకారం చేసిన మిత్రులను నమ్మించి మోసం చేయడం, తల్లిలాంటి గురుపత్నితో అక్రమ సంబంధం పెట్టు కోవటం- ఇలాంటి వాటివల్ల నరుడు నరకలోకానికి వెడతాడు.

**99. దేశకాలజ్ఞుడైన దేశాధిపతి :**

నయశ్చ వినయశ్చోభౌ యస్మిన్సత్యం చ సుస్థితమ్।
విక్రమశ్చ యథాదృష్టః స రాజా దేశకాలవత్॥ 18-8

రాజనీతి, వినయం, సత్యం, పరాక్రమం కల నరపతి దేశకాలజ్ఞుడై దేశాన్ని చక్కగా పరిపాలిస్తాడు.

దేశకాలాలకు అనుగుణంగా పోనివాడు, ఏ రంగంలోనైనా దెబ్బతింటాడు. తను ఏ ప్రదేశంలో, ఎలాంటి పరిస్థితుల్లో, ఏ పని చేస్తున్నాడో అర్థంజేసుకొని, దాని కనుగుణంగా నడచుకోవాలి. పరిపాలకుల్లో తప్పకుండా రాజనీతి, వినయం, సత్యం, పరాక్రమం అనే గుణాలుండాలి. అలాంటి వాడే దేశాన్ని కాలాన్ని అర్థం జేసుకొని వాటికనుగుణంగా నడుచుకోగలుగుతాడు. లోక కల్యాణాన్ని సాధించగలుగుతాడు.

**100. ముగ్గురూ తండ్రులే :**

జ్యేష్ఠో భ్రాతా పితా చైవ యశ్చ విద్యాం ప్రయచ్ఛతి।
త్రయస్తే పితరో జ్ఞేయా ధర్మే పథి హి వర్తినః॥ 18-13

ధర్మమార్గంలో జీవించేవాళ్ళకు పెద్దఅన్న, కన్నతండ్రి, గురువు- ఈ ముగ్గురూ తండ్రులే అవుతారు.

జన్మనిచ్చిన తండ్రి ఒక్కడే, కానీ వినయ విధేయతలను నేర్పి, పెంచి, పెద్దజేసిన పెద్దఅన్నకూడా తండ్రిలాంటి వాడే. మనస్సులో ఉన్న అజ్ఞానాంధ కారాన్ని పోగొట్టి, భౌతిక శరీరానికంటే, విలువైన విజ్ఞానిక శరీరాన్ని ఇచ్చిన

గురువు కూడా తండ్రిలాంటివాడే. కన్నతండ్రితో పాటే అన్నను, గురువును కూడా గౌరవించాలనే విషయాన్ని మనం గుర్తించాలి.

**101. ముగ్గురు కొడుకులు :**

యవీయానాత్మనః పుత్రః శిష్యశ్చాపి గుణోదితః।
పుత్రవత్తే త్రయశ్చిన్త్యా ధర్మశ్చేదత్ర కారణమ్॥ 18_14

ధార్మికంగా నడిచేవాళ్ళకు చిన్నతమ్ముడు, కొడుకు, గుణవంతుడైన శిష్యుడు ఈ ముగ్గురూ కొడుకులే అవుతారు.

ధర్మమార్గంలో జీవనం చేసేవాళ్ళకు ఆఖరు తమ్ముడు, యోగ్యుడైన శిష్యుడు కూడా పుత్రునితో సమానులే. వాళ్ళను కూడా తన కన్నకొడుకులాగే ప్రేమతో చూసుకోవాలి. పుత్ర ప్రేమతో శిష్యుణ్ణి, తమ్ముణ్ణి చూడాలనేది ఇక్కడ ముఖ్యోద్దేశ్యం.

**102. మరణదండనే సరైన శిక్ష :**

ఔరసీం భగినీం వాపి భార్యాం వాఽప్యనుజస్య యః।
ప్రచరేత నరః కామాత్తస్య దండో వధః స్మృతః॥ 18_23

కన్న కూతురితోను, సోదరితోను, తమ్ముడి భార్యతోను కామంతో తిరిగిన వాడికి శిక్ష మరణదండనమే.

ఎన్నో తప్పులు, వాటికెన్నో శిక్షలు. ధర్మశాస్త్రాలు మానవుడు తెలిసో తెలియకో చేసిన తప్పులకు సరైన శిక్షలను విధిస్తాయి. కామాతురుడై కన్నూ మిన్నూ గానక సంచరించే పురుషాధముడు కన్న కూతురుతో, సోదరితో, మఱదలితో శారీరక సంబంధాన్ని పొందితే వాడికి మరణదండనమే శిక్ష. వాడుచేసిన తప్పుకు అంతకంటే తక్కువ శిక్షతో వాణ్ణి ఉద్ధరించడం కష్టం. కాబట్టి ఉరి శిక్షను విధిస్తున్నారు.

**103. ఎవణ్ణి గురించి ఏడుస్తున్నావు ?**

శోచ్య! శోచసి కం శోచ్యం దీనం దీన్యానుకమ్పసే।
కస్య కో వాఽనుశోచ్యోఽస్తి దేహేఽస్మిన్నబ్బుద్బుదోపమే॥
21_3

నీవే దుఃఖితుడివి. ఇంకొకళ్ళను గురించి ఎందుకు దుఃఖపడుతున్నావు ? నీవే దీనుడివి, ఇంకొకణ్ణి చూచి ఎందుకు జాలిపడుతున్నావు? గాలిబుడగ జీవితం

గడుపుతున్న మానవుడు ఇతరులను గురించి బాధపడే అవకాశం ఎక్కడుంది ?

మానవజీవితం క్షణికమైంది. తటాకంలో గాలికి గాలిబుడగ పుట్టినట్లు పుట్టి, ఏ క్షణంలో చితికిపోతుందో ఎవరికీ తెలియదు. అలాగే మన జీవితం గూడా ఎప్పుడు ఏమౌవుతుందో ఎవరికి తెలుసు ? నీ జీవితమే నశ్వరమైంది. ఎన్నో దుఃఖాలకు దుర్యోగాలకు పుట్టినిల్లు. అలాంటప్పుడు ఎవడో దుఃఖపడుతున్నాడు. వాడి దుఃఖాన్ని నేను పోగొడతానని నీవనుకోవడం ఎంత అవివేకమో ఆలోచించు ! అలాగే నీవే దీనుడివై యుండి, లోకంలో ఇతరుల్ని చూచి అయ్యో! పాపమని జాలిపడి వాళ్ళకేదో చేసి, పుణ్యం కట్టుకోవాలని తపన పడుతున్నావు! ముందు నీ దైన్యాన్ని నీవు తొలగించుకో ! నీ దుఃఖాన్ని నీవు పోగొట్టుకో ! ఆ తరువాత ఇతరులను గురించి బాధపడు ! ''ఉద్ధరేదాత్మనాఽత్మానమ్'' అని అందుకే అంటారు.

**104. మధ్యేమార్గంలో మనుగడ సాగించాలి :**

> న చాతిప్రణయః కార్యః కర్తవ్యోఽప్రణయశ్చతే।
> ఉభయం హి మహాన్దోషస్తస్మాదన్తరదృగ్భవ॥ 22-22

తోడి వారితో మరీ ఎక్కువ స్నేహం చేయడంకాని, లేకపోతే అసలే స్నేహం చేయకపోవడం కాని- ఈ రెండూ ప్రమాదమే. కనుక సంయమనంతో మధ్యస్థంగా ఉండే మార్గాన్ని అనుసరించు !

కొంతమంది ఇతరులతో చేసే స్నేహం చూస్తే, ఎబ్బెట్టుగా ఉంటుంది. అవతలివాడు 'ఈ వ్యక్తితో ఎలా బ్రతకడమా !' అని బాధపడుతుంటాడు. ఇంకొంతమంది తోడివాడు ఎంత ప్రమాదంలో ఉన్నా తనకేమీ తెలియనట్లు ఊరికినే ఉండిపోతారు. తన చుట్టూ ఉండే ప్రపంచానికి తనకూ ఎలాంటి సంబంధం లేనట్లే ఉంటారు. ఈ రెండు పద్ధతులు ఎంతో ప్రమాదకరమైనవి. చాలా దోష భూయిష్ఠమైనవి. సంయమనంతో ఈ రెంటికి మధ్యేమార్గం అనుసరిస్తే తన జీవితం, జన జీవితం గూడా బాగా ఉంటుంది. సమాజంలో చక్కని స్నేహమయ వాతావరణం ఏర్పడుతుంది.

**105. ఎన్ని ఉన్నా విధవరాలే :**

> పతిహీనా తు యానారీ కామం భవతు పుత్రిణీ।
> ధనధాన్యైః సుపూర్ణాపి విధవేత్యుచ్యతే జనైః॥ 23-12

భర్తలేని స్త్రీకి యెంతమంది పిల్లలున్నా, యెన్ని ధనధాన్యాలు భోగ భాగ్యాలు ఉన్నా ఆమెను విధవరాలే అంటారు.

యెన్ని ఉన్నా యేం ప్రయోజనం ? ఉండాల్సిన పసుపు కుంకుమలకు నోచుకోకపోయిన తరువాత? ఆమెకు పిల్లలున్నారు. కానీ యేం లాభం ? స్త్రీకి ముఖ్యమైన సౌభాగ్యం లేదు. ప్రాణనాథుడు, ప్రత్యక్షదైవమైన పతిదేవుడు లేడు. కినుక ఇన్ని ఉన్నా ఆమె విధవరాలే. స్త్రీకి అన్ని భాగ్యాలకంటే ముత్తైదువగా ఉండే సౌభాగ్యమే ముఖ్యమైనది. అది లేక పోయింతరువాత యెన్ని ఉన్నా లేనట్లే.

**106.** **అన్నిదానాలకంటె మిన్న కన్యాదానం :**

**శాస్త్రప్రయోగా ద్వివిధాచ్చ వేదాత్**
**ఆత్మా హ్యనన్యః పురుషస్య దారాః॥**
**దారప్రదానాన్న హి దానమన్య**
**త్ర్పదృశ్యతే జ్ఞానవతాం హి లోకే॥** 24_38

భార్య భర్తలో సగభాగమే గాని వేఱుకాదని సకల వేదాలు, ధర్మశాస్త్రాలు ప్రతిపాదిస్తున్నాయి. అందుకే జ్ఞానులు, కన్యాదానాన్ని మించిన దానం లేదని చెపుతున్నారు.

భార్య సగం, భర్త సగం. ఈ రెండు సగాలు చేరితేనే ఏర్పడుతుంది పూర్ణ స్వరూపం. అంతవఱకు ఇద్దఱికీ పరిపూర్ణత లేదు. అందుకే వివాహం ద్వారా వధువు–వరుడు తమ జీవితాల్లో ఒక సమగ్రతను సమన్వయాన్ని సాధిస్తున్నారు. గృహస్థాశ్రమం అన్ని ఆశ్రమాలకు తల్లిలాంటిదైనది. వేదాలు శాస్త్రాలు అన్నీ, ఈ విశేషాన్ని చాటిచెబుతున్నాయి. పురుషునిలో సగభాగమైన స్త్రీ, వివాహానంతరం అర్థాంగి అవుతున్నది. అంటే పురుషుని శరీరంలో ఆమె సగమన్నమాట. శరీరమంటే భౌతికమైన బాహ్యశరీరం మాత్రమే కాదు. జ్ఞానమయ శరీరం కూడా. అందుకే 'అర్థో వా ఏష ఆత్మనః పత్నీ' అంటున్నది శ్రుతి. అన్ని దానాలకంటే కన్యాదానం యెంతో గొప్పది. కన్యను ఇచ్చి, వరుని జీవితానికి పరిపూర్ణత నందిస్తున్నారు కన్యాదాతలు. కానీ ఈనాడు ఈ మహత్తర సత్యాన్ని పక్కకునెట్టి, వరకట్న పిశాచానికి యెంతమందో అమాయకులైన అమ్మాయిలను బలి చేస్తున్నదీ సమాజం. గొప్ప నాగరికులమని విఱ్ఱవీగే మనం సమాజంలో ఈ బలిని చూసి సిగ్గుపడాలి.

**107.** దేంట్లోను కర్తృత్వం లేదు :

న కర్తా కస్య చిత్కశ్చిన్నియోగే చాపి నేశ్వరః।
స్వభావే వర్తతే లోకస్తస్య కాలః పరాయణమ్॥ 25-5

ఈ లోకంలో యెవరూ స్వతంత్రుడు కాదు. ఏ పనైనా చేయాలంటే వాడి ఇష్టమొచ్చినట్లు చేయడానికి వీల్లేదు. భవితవ్యాన్ని బట్టి అదృష్టమే ప్రతి పనికీ రేఖలు దిద్దుతుంటుంది.

"నేనే అన్నీ చేసేస్తున్నా" నని ప్రతివాడు అహంకారపడతాడు. నిజ మాలోచిస్తే, ఈ లోకంలో మానవ మాత్రుడు చేయగలిగిందేదీ లేదు. మిథ్యా కర్తృత్వాన్ని మీద వేసుకొని మిడిసిపడటమేగాని ఈయన చేయకపోతే ఏదీ ఆగదు. జరిగిపోయే ఈ నాటక రంగంలో కర్త పాత్రను ఇతను అభినయి స్తున్నాడు. ఇదంతా ఆ జగన్నాథుని మాయాజాలం. లోకంలో ప్రతిక్షణం, ప్రతి పనీ జరుగుతున్న తీరుతెన్నులను మానవుడు లోకంలో కళ్ళు తెరచి చూస్తే విశ్వ రంగస్థలంలో తన పాత్ర ఎంత చిన్నదో అర్థమవుతుంది. ఈ మహా నాటకాన్ని అదృష్టమనే అదృశ్య హస్తంతో ఆది దేవుడే తీర్చి దిద్దుతున్నాడు.

**108.** కాలానికి చుట్టరికమేముంది ?

న కాలస్యాస్తి బన్ధుత్వం నహేతుర్న పరాక్రమః।
న మిత్రజ్ఞాతి సంబంధః కారణం నాత్మనోవశః॥ 25-7

కాలానికి ఎవరితోను బంధుత్వంగాని, మైత్రిగాని, జ్ఞాతిత్వంగాని లేదు. కారణాలతోను పరాక్రమంతోను దాన్ని జయించలేము. అది ఎన్నటికీ మన ఆధీ నంలో ఉండదు. మనమే దాని అధీనంలో ఉండాలి.

సమాజంలో వ్యక్తికి వ్యక్తికీ మధ్య, ఎన్నో మొగమాటాలుంటాయి. వాటినిబట్టి మన నిర్ణయాలు మార్చుకుంటూ పోతాం. కాని కాలానికి ఎవరితోను చుట్టరికం గాని, స్నేహంగాని, దాయాద్యంగాని ఉండదు. మొగమాటం అసలే ఉండదు. హేతు వాదాలతో పరాక్రమాలతో కాలాన్ని మనం ఏమీ చేయలేము. అది విశ్శృంఖలంగా విహరిస్తుంది దానికి విశ్వమంతా తలవొగ్గ వలసిందేగాని, అది మాత్రం ఎవరికీ తలవొగ్గదు. మరి కాలమంటే ఎవరు ? దైవమే గదా !

**109.** నాలుగూ సరిగా ఉంటేనే రాజ్యం :

యస్యకోశశ్చ దండశ్చ మిత్రాణ్యాత్మాచ (భూమిప)।
సమవేతాని సర్వాణి స రాజ్యం మహదశ్నుతే॥ 29-11

కోశాగారాన్ని, దండన విధానాన్ని, మిత్రులను, తనను, సమన్వయం చేసుకొని పరిపాలించే రాజు పది కాలాలపాటు రాజ్యం నిలబెట్టుకుంటాడు.

ప్రభుత్వాలు నిలబడటానికి, పడిపోవటానికి ఎన్నో కారణాలుంటాయి. వాటిల్లో ఇవి కూడా ముఖ్య కారణాలే-ఆర్థిక వనరులు, తప్పు చేసిన వాళ్ళను సరిగా దండించడం, రాజుకు సలహాల నిచ్చే మిత్రులు, చక్కని వ్యక్తిత్వం గల రాజు- ఈ నాలుగు అంశాలు. దేశకాలజ్ఞుడైన రాజు రాష్ట్రం ఆర్థిక స్తోమతను మనస్సులో ఉంచుకొని, మంత్రుల మంచి సలహాలను తీసుకొని, శాంతి భద్రతలకు భంగం లేకుండా దండనీతిని ప్రయోగిస్తూ పారిపాలిస్తే, ఆ రాజ్యం అభివృద్ధికి వస్తుంది. వీటిల్లో ఏ ఒక్కటి సరిగా లేకపోయినా ఆ రాజు, ఆ రాజ్యం ఎక్కువ కాలం నిలవడం అసంభవం.

**110. వాడే పురుషాధముడు :**

**అర్థినాముపపన్నానాం పూర్వం చాప్యుపకారిణామ్।**
**ఆశాం సంశ్రుత్య యో హన్తి స లోకే పురుషాధమః॥ 30-71**

ఇంతకు పూర్వం ఉపకారం చేసి, ఇప్పుడు ఆపదలో ఉండి, తన దగ్గఱకు వచ్చినవాళ్ళ బాధలను విని కూడా ఎవడు సహాయపడడో, లోకంలో వాడే పురుషాధముడు.

మానవుడి మనస్తత్వం చాలా విచిత్రమైంది. ఇతరుల నుంచి ఎన్ని ఉపకారాలు పొందడానికైనా వెనకాడదు. సిగ్గు పడదు. కాని ఉపకారం చేసినవాడు ఆపదల్లో తన దగ్గఱికి వచ్చి సహాయాన్ని ఆర్థిస్తే వాడితో తనకు పూర్వ పరిచయం లేనట్లు, తానేమీ సహాయం చేయలేనట్లు చెప్పటానికి వెనకాడదు. ఇంతకంటే ఘోరం ఏదైనా ఉంటుందా? ఇతగాడికంటే నీచుడెవడైనా ఉంటాడా?

**111. ఎవడు పురుషోత్తముడు ?**

**శుభం వా యది వా పాపం యోహి వాక్యముదీరితమ్।**
**సత్యేన పరిగృహ్ణాతి స వీరః పురుషోత్తమః॥ 30-72**

పుణ్యమైనా పాపమైనా చెప్పిన మాటను నిలబెట్టుకొనే వీరుడే నిజంగా పురుషోత్తముడు.

అన్న మాట నిలబెట్టుకోవడం అందరూ చేయలేని పని. దానికి ఎంతో క్రమశిక్షణ కావాలి. ఒకసారి మాట ఇచ్చిన తరువాత మిన్ను విరిగి మీద పడినా, పాపమే వచ్చినా పుణ్యమే అబ్బినా దాన్ని నిలబెట్టుకోవడానికి అన్ని విధాలా

ప్రయత్నించాలి. అలా నిలబడాలంటే ఎంతో ధైర్యం కావాలి, తెగింపు ఉండాలి. అలా మాటకు నిలబడగల ధీరుడే పురుషోత్తముడు. "అంగీకృతం సుకృతినః పరిపాలయంతి ' అని కదా లోకోక్తి !

**112.** **స్నేహాన్ని నిలుపుకోవడం చాలా కష్టం :**

**సర్వథా సుకరం మిత్రం దుష్కరం పరిపాలనమ్,**
**అనిత్యత్వాచ్చ చిత్తానాం ప్రీతిరల్పేఽపి భిద్యతే॥** 32-7

మిత్రుణ్ణి సంపాదించడం చాలా తేలిక, కాని ఆ మైత్రి చెడకుండా కాపాడు కోవటం చాలా కష్టం. మానవుల మనస్సులు చాలా చంచలమైనవి. చిన్న విష యంలోనే ఇద్దరికీ భేదాభిప్రాయం రావచ్చు.

కొత్త స్నేహితుల్ని సంపాదించుకోవడమంటే కొంతమందికి ఎంతో పిచ్చి. కొందరితో విరోధాలు పెట్టుకోవటం, కోరి కోరి కొత్త స్నేహాలను చేసు కోవటం వాళ్లకు సరదా. మిత్రులను సంపాదించటం అంత కష్టమైన పనికాదు. కాని చిత్తశుద్ధితో, ఆ మైత్రిని జీవితాంతం నిలబెట్టుకోవడం కత్తిమీద సాము వంటిది. ఎన్నో జాగ్రత్తలు తీసుకొంటే గాని, మైత్రి శాశ్వతంగా నిలబడదు. మానవుడి మనస్తత్వం స్థిరమైంది కాదు. చిన్న తేడా వచ్చినా స్నేహం దెబ్బ తిని పోతుంది. ఒకళ్ళనొకళ్ల బాగా అర్థం జేసుకొని, అవగాహనతో నడుచు కొంటే మధ్యలో ఎన్ని తేడాలొచ్చినా స్నేహం స్థిరంగా నిలబడుతుంది.

**113** **కృతఘ్నుడికి నిష్కృతి లేదు:**

**బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా।**
**నిష్కృతిః విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః॥**
34-12

బ్రాహ్మణహంతకునికి, తాగుబోతువాడికి, దొంగకు, వ్రతభంగం చేసు కొన్న వాడికి ధర్మశాస్త్రకారులు ప్రాయశ్చిత్తాలను చెప్పారు. కాని కృతఘ్నుడికి మాత్రం నిష్కృతి లేనేలేదు.

ఎన్ని పాపాలకైనా ధర్మశాస్త్రాలు ప్రాయశ్చిత్తాలను చెప్పగలిగాయిగాని, కృతఘ్నుడికి ప్రాయశ్చిత్తాన్ని చెప్పలేకపోయాయి. బ్రాహ్మణ హంతకుడు, తాగుబోతు, దొంగ, భగ్నవ్రతుడు మొ॥ వాళ్ళు ప్రాయశ్చిత్తం చేసుకుంటే పవిత్రులు కావచ్చుగాని, మిత్రద్రోహి, కృతఘ్నుడైన వాడు, ఏమి చేసినా ఆ పాపానికి నిష్కృతిలేదు. అంటే కృతఘ్నతను మించిన పాపం లేదన్నమాట.

**114.** క్రింద పడితేనే తెలుస్తుంది :

హిత్వా ధర్మం తథాఽర్థం చ కామం యస్తు నిషేవతే।
స వృక్షాగ్రే యథా సుప్తః పతితః ప్రతిబుధ్యతే॥ 38-20

ధర్మాన్ని, అర్థాన్ని వదిలి పెట్టి కామపురుషార్థాన్ని మాత్రమే సేవించే వాడు పతితుడౌతాడు. చెట్టుకొమ్మపైన నిద్రపోయేవాడు క్రింద పడ్డ తరువాతనే తనెక్కడ పడుకుంది తెలుసుకుంటాడు.

ఈ లోకంలో ఎంతో మంది మూడో పురుషార్థం కోసమే ముచ్చటగా పుడుతుంటారు. శ్లేష్మంలో పడ్డ ఈగలాగా వాళ్ళు ఆ ఊబిలోంచి బయటపడ లేరు. అసలు వాళ్ళకు ధర్మం, అర్థమని ఇంకా రెండు పురుషార్థాలు ఉన్నాయని కూడా తెలియదు. మోక్షం మాట సరేసరి. ధర్మాన్ని అతిక్రమించకుండా అను భవించే అర్థమైనా, కామమైనా అనర్థాలు కావు. ధర్మాతిక్రమం జరిగినప్పుడే అక్రమాలు, అన్యాయాలు చోటు చేసుకుంటాయి. ధర్మార్థాలను వదిలిపెట్టికామాన్ని సేవించడం, చెట్టు మొదలును వదిలిపెట్టి కొమ్మమీద నిద్రపోవడం లాంటిది. ఆ మత్తులో ఎప్పుడో క్రింద పడిపోతాడు అలా పడిన తరువాతే తెలుసుకొంటాడు; ఇంతసేపు తనెక్కడ నిద్రపోయిందీ. కామంవల్ల కర్తవ్యాన్ని మరచిపోయి పతితుడై, అప్పుడు కళ్ళు తెరుస్తాడు. అప్పటికే జీవితమంతా పూర్తయిపోతుంది. శరీరం శిథిలమైపోతుంది. అందుకే ముందు జాగ్రత్తపడటంఎందుకైనా మంచిది.

**115.** సామోపాయానికి సరి ఏదీలేదు :

న హి సామోపపన్నానాం ప్రహర్తా విద్యతే క్వచిత్। 59-17

మెత్తగా వినయంతో అడిగిన కోరికను ఎవ్వరూ కాదనలేరు.

ఏ కార్యాన్నైనా సాధించడానికి సామం, దానం, భేదం, దండం అని ఉపాయాలు నాలుగున్నాయి. కొన్ని కొన్ని కార్యాల్లో కొన్ని ఉపాయాలు ఉపయో గిస్తాయి. కొందరు మనుషుల మీద కొన్ని ఉపాయాలు నిరర్థకమౌతాయి. కానీ సామోపాయంతో, సత్త్వగుణంతో చల్లగా, మెల్లగా ఏ కార్యాన్నైనా సాధించ డానికి పూనుకుంటే దాదాపు ఫలితం అనుకూలంగా ఉంటుంది. మెత్తగా అడిగే వాణ్ణి, వినయ విధేయతలతో పనిచేసేవాణ్ణి ఈ లోకంలో ఎవరూ త్రోసి పుచ్చరు.

**116.** విషాదంవల్ల వినాశం తప్పదు :

న విషాదే మనః కార్యం విషాదో దోషవత్తమః,
విషాదో హన్తి పురుషం బాలం క్రుద్ధ ఇవోరగః॥ 64-11

మనస్సునెప్పుడూ విషాదంలో ఉంచకూడదు. విషాదం చాలా తీవ్రమైన దోషం. క్రోధంతో బుసలుకొడుతున్న పాము, చిన్న పిల్లవాణ్ణి చంపినట్లు, విషాదం మానవుణ్ణి సర్వనాశనం చేస్తుంది.

మానవుడి మనస్సు ఎంతో బలహీనమైనది. కొంచెం కథ అడ్డం తిరిగితే వెంటనే తలక్రిందులైపోతుంది. విషాదం తనలో ప్రవేశించిన తరువాత వెయ్యి మాటలు చెప్పినా విననే వినదు. కాబట్టి కార్యశూరుడు మనస్సులో ఎప్పుడికీ విషాదానికి, నిరుత్సాహానికి చోటునివ్వకూడదు. పాము అడుకోవటానికి తన దగ్గరకు వచ్చిన అమాయకుడైన పిల్లవాణ్ణి, ఏలా కాటేసి చంపుతుందో, అలాగే హాస్యానికైనా మనస్సులా నిరుత్సాహపరిస్తే, అది సర్వకార్యాలను అట్టే నాశనం చేస్తుంది, అందుకనే మనస్సును నిర్మలంగా నిత్యం ఉత్తేజంతో, ఉత్సాహంతో నిలుపుకోవాలి. మనస్సును అధీనంలో పెట్టుకోక పోతే మనిషి మనిషిగా బ్రతకడం కష్టం.

# సుందరకాండ

**117.** **అతిథిని గౌరవించాలి :**

**అతిథిః కిల పూజార్హః ప్రాకృతోఽపి విజానతా,** 1-120

అతిథి అనాగరికుడైనా వివేకి, ధార్మికుడు అయిన యజమాని అతణ్ణి గౌరవించి తీరాలి.

మన ఇంటికి ఎలాంటి అతిథి వచ్చినా అతడు నాగరకుడా? అనాగరకుడా? ధనికుడా? పేదవాడా? అనే గుణదోషాల చర్చమాని అతణ్ణి గౌరవించాలి. అతడెలాంటి వాడైనా సరే, మన ఇంటికి అతిథిగా వచ్చాడు అతిథిగా వచ్చిన వాడెలాంటి వాడైనా అతణ్ణి భగవంతునిలాగా ఆదరించి, గౌరవించి పంపాలి. జ్ఞానులు అతడిలో ఆదిదేవుణ్ణే చూస్తారు. అందుకే ఆమ్నాయం 'అతిథిదేవోభవ' అంటున్నది.

**118.** నాలుగు గుణాలుంటే నాశమే ఉండదు :

**యస్య త్వేతాని చత్వారి (వానరేంద్ర యథా తవ)।**
**ధృతిర్దృష్టిర్మతిర్దాక్ష్యం స్వకర్మసు న సీదతి॥** 1-198

ఎవరిలో ధైర్యం, దూరపుదృష్టి. కార్యాకార్యవిచారణ, సామర్థ్యం— ఈ నాలుగు ఉంటాయో వాళ్లు తలపెట్టిన కార్యాలు దిగ్విజయంగా నెరవేరుతాయి.

ఏదైనా కార్యాన్ని సాధించాలంటే అతడిలో కొన్ని ఉత్తమ లక్షణాలుండాలి. కార్యసాధకుడిలో ముఖ్యంగా ధైర్యం ఉండాలి. కొంత భవిష్యత్తులోకి పోయి కార్యపరిణామాన్ని దర్శించగల నేర్పుకావాలి. కర్తవ్యాకర్తవ్య పరిజ్ఞానం దానికి తోడు కావాలి. ఇన్ని ఉన్నా అతడు సమర్థుడు కాకపోతే ఏమీ ప్రయోజనం ఉండదు. కనుక కార్యనిర్వహణ సామర్థ్యముండాలి. ఇలాంటి లక్షణాలున్నవాడు ఎంత క్లిష్టమైన పనినైనా తేలికగా సాధించగలుగుతాడు. కార్యాన్ని నాశనం చేసుకోడు.

**119.** దూతను బట్టే కార్యసిద్ధి :

**భూతాశ్చార్థా విపద్యన్తే దేశకాల విరోధితాః।**
**విక్లబం దూతమాసాద్య తమస్సూర్యోదయే యథా॥**
**అర్థానర్థాంతరే బుద్ధిర్నిశ్చితాఽపి న శోభతే।**
**ఘాతయన్తి హి కార్యాణి దూతాః పండితమానినః॥** 2-39, 40

తెలివితేటలులేకుండా దేశకాలాలకు విరుద్ధంగానడిచే దూతను పంపితే తేలికగా పరిష్కరింపబడే కార్యాలు కూడా సూర్యోదయంకాగానే, చీకటి పటాపంచలైపోయినట్లు పాడైపోతాయి. గొప్ప శక్తిసామర్థ్యాలు, తెలివితేటలు తనకున్నాయని తనపై దురభిమానం పెంచుకున్న దూత, మంత్రుల నిర్ణయాలను పాటించకుండా దౌత్యంలో స్వతంత్రంగా వ్యవహరిస్తాడు. దానివల్ల తేలికగా పూర్తయ్యే పనులు కూడా సర్వనాశనమైపోతాయి.

రాయబారిగా వెళ్ళేవాడికి దేశజ్ఞానం, కాలజ్ఞానం ఎంతో కావాలి. తెలివితేటలతో సమస్యలను తేలికగా పరిష్కరించే సామర్థ్యం ఉండాలి. అంతేగాని, తేలికగా పరిష్కరింపబడే సమస్యలను కూడ గర్వంతో, దురభిమానంతో క్లిష్టమైనవిగా తయారుచేసి, తను పరిష్కరింపలేక, ఇంకొకళ్ళకు అవకాశం ఇవ్వకుండా చెడకొట్టకూడదు. మంత్రివర్గంలో జరిగిన నిర్ణయాలను రాయబారి అమలు

చేయాలేగాని తను స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకొని వెనుకటివాటిని రద్దు చేయకూడదు. అలా చేస్తే దౌత్యంద్వారా కార్యహాని కలుగుతుందిగాని, కార్యసిద్ధి జరగదు.

**120.** మంచికి చెడుకు మనస్సే కారణం :

**మనో హి హేతుస్సర్వేషామింద్రియాణాం ప్రవర్తనే।**
**శుభాశుభాస్వవస్థాసు తచ్చ మే సువ్యవస్థితమ్॥** 11-41

ఇంద్రియాలన్నీ మంచిలోగాని, చెడులోగాని ప్రవర్తించడానికి మనస్సే కారణం. ఆ మనస్సును నిగ్రహించి అధీనంలో పెట్టుకోవాలి.

మనస్సు సరిగా ఉంటే అంతా మంచే జరుగుతుంది. ఇంద్రియాలవెంట మనస్సు పరుగెత్తకూడదు. మనస్సు చెప్పుచేతల్లో ఇంద్రియాలను పెట్టుకోవాలి. అలా ఇంద్రియాలు చెప్పినమాట వింటే మనస్సు మంచిపనుల్లోనే వాటిని ప్రవర్తింపజేస్తుంది. మంచిపనులు చేసినవాడు మంచినే అనుభవిస్తాడు. అందుకే అన్నింటికీ మనస్సే మూలం. కాబట్టి మనస్సును నిగ్రహించి, మనుగడ సార్థకం చేసుకోవాలి. 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' అని కదా సుభాషితం!

**121.** నిరుత్సాహంతో నీరసించిపోకు :

**అనిర్వేదః శ్రియో మూలం అనిర్వేదః పరం సుఖమ్।**
**అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః॥** 12-10

సంతోషమే సంపదలన్నింటికి మూలం. సంతోషమే గొప్ప సుఖం. సంతోషంగా చేసే పనులన్నీ చక్కగా విజయాన్ని సాధిస్తాయి.

నిర్వేదంతో నీరసించి పొమ్మని వేదంకూడా ఎక్కడా చెప్పదు. నిర్వేదాన్ని నిలవకుండా పారద్రోలాలి. సర్వకాల సర్వావస్థల్లోను సంతోషంగా ఉండటానికే ప్రయత్నించాలి. నీవు సంతోషంగానో, దుఃఖంగానో ఏ అవస్థలో ఉన్నా జరగవలసింది జరిగే తీరుతుంది. నీ సంకల్పాలన్నీ జరుగుతాయని నమ్మకం లేదు. అందువల్ల ఫలితం భగవాన్‌కు వదిలేసి పకడ్బందీగా కర్తవ్యాన్ని నిర్వహించడం అలవాటు చేసుకోవాలి. సంతోషంగా ఉన్నవాడికే సకల సంపదలు సమకూరుతాయి. అసలు సంతోషాన్ని మించిన సుఖమేముంటుంది? సంతోషంగా ఏ పని మొదలుపెట్టినా అది సజావుగా విజయాన్ని

తప్పక సంతరిస్తుంది. అందుకే 'సంతోష ఏవ పురుషస్య పరం నిధానమ్' అని అంటారు.

**122.** బ్రతికుంటే బలుసాకు తినచ్చు :

**వినాశే బహవో దోషాః జీవన్ భద్రాణి పశ్యతి।** 13-47

ఏ పరిస్థితుల్లోను ఆత్మహత్య చేసుకోకూడదు. దానివల్ల ఎన్నో దోషాలు సంభవిస్తాయి. జీవించి ఉంటే యెప్పటికైనా మంచిని పొందడానికి అవకాశం ఉంటుంది.

ఆవేశం యెన్నో అనర్థాలకు దోవతీస్తుంది. నిరాశోపహతుడు నిలవలేక పోతాడు. ఆత్మ సంఘర్షణకు గురౌతాడు. బ్రతుకే భారమనిపిస్తుంది. ఆత్మ హత్యకు పాల్పడతాడు. ఆత్మహత్యవల్ల ఎన్నో దోషాలు సంభవిస్తాయి. ఇతరులను హత్య జేయటం కంటే ఆత్మహత్య మహాదోషం. చచ్చి సాధించే దేముంటుంది? కొరివిదయ్యమై తిరగడం తప్ప. బ్రతికుంటే పరిస్థితులు తప్పకుండా మారతాయి. సహనంతో ఉన్నవాడికి సకల వ్యవహారాలు చక్క బడతాయి. వాడే యెన్నో అభ్యుదయాలను సాధిస్తాడు. సమాజానికి తనవంతు సేవను సమర్పిస్తాడు. ఆగండి! ఒక్కక్షణం ఆలోచించండి! ఏ పరిస్థితుల్లోను ఆవేశంతో ఆత్మహత్యలకు గురికాకండి!

**123.** **పరితపించాడు పరమేశ్వరుడు :**

ఇయం సా యత్కృతే రామశ్చతుర్భిః పరితప్యతే।
కారుణ్యేనానృశంస్యేన శోకేన మదనేన చ॥
స్త్రీ ప్రణష్టేతి కారుణ్యాదాశ్రితే త్యానృశంస్యతః।
పత్నీ నష్టేతి శోకేన ప్రియేతి మదనేన చ॥ 15-49, 50

ఈ మహాసాధ్వికోసమా రాముడు, ఒకస్త్రీ అపహరింపబడిందనే కారుణ్యం తోను, తన నాశ్రయించి ఉన్నదనే దయతోను, ధర్మపత్ని నశించిపోయిందనే దుఃఖంతోను, ప్రాణ ప్రియురాలనే ప్రేమతోను పరితపించిపోయినాడు!

మాయామానుష వేషధారి శ్రీరామచంద్రుడు. సత్యధర్మాలకు సమగ్ర మైన రూపకల్పన ఆయన మానవుడై అవతరించిన మర్యాదా పురుషోత్తముడు. జానకి కోసం కన్నీరుపెట్టాడు యెందుకంటే: సర్వస్వం భర్తేనని వనవాసాని కొచ్చిన సాధ్వి ఆమె. ఆమె అపహరింపబడింది. కాపాడాడు శ్రీరామచంద్రుడు.

కాపాడటానికి కారణాలు చెబుతున్నాడు. కారణజన్ముడైన మహర్షి. రాజ్యంలో అపహరింపబడిన స్త్రీని కాపాడాలనే కరుణ, తన నాశ్రయించి అడవులకు కూడా వచ్చిందనే జాలి, ధర్మపత్ని నశించిపోయిందని దుఃఖం. ప్రాణాధిప్రియురాలనే ప్రణయం. ఇన్ని కారణాలవల్ల పరితపించిపోయాడు కరుణానిధి దాశరథి. అంతేగాని, కేవలం స్త్రీ వ్యామోహంవల్ల మాత్రం కాదు.

**124. ఆడదానికి భర్త: అలంకారాలకే అలంకారం:**

**భర్తా నామ పరంనార్యా భూషణం భూషణాదపి।**
**ఏషాఽతో రహితా తేన భూషణార్హా న శోభతే॥** 16-26

భారతీయ మహిళకు భర్త అన్ని అలంకారాలకంటే గొప్ప అలంకారం. అందువల్ల ఎన్ని అలంకారాలున్నా భర్తలేని పడతి పదిమందిలో శోభించదు.

భారత స్త్రీ భౌతిక జీవితానికంటే భవ్యమైన ఆధ్యాత్మిక జీవితానికే ప్రాధాన్యమిస్తుంది. మానవ జాతిలోనే భార్యాభర్తల సంబంధానికి, వివాహబంధానికి ఒక అందమైన అర్థాన్ని, పరమార్థాన్ని చాటిచెప్పింది భారతదేశం. ఈ దేశపు మహిళ తాను ధరించే మహితమైన ఆభరణాలకంటే భర్తను పరమాభరణంగా భావిస్తుంది. ఏ ఆభరణాలు లేని నిర్ధన కూడా తన ధవుడితో జీవితాన్ని ఆనందంగా గడపగలుగుతుంది. మాధవసేవకు మాయని కుసుమంగా అంకితమౌతుంది. అదే; సకల సంపదలు, వజ్ర వైడూర్యాలు పొదిగిన ఆభరణాలు కల ఆడదికూడా భర్తలేకపోతే అవన్నీ వ్యర్థమనుకుంటుంది. తనకు తానే వెలివేసుకుంటుంది. జీవచ్ఛవంలా కాలం గడుపుతుంది. అందువల్ల అలంకారాలన్నింటినీ, మించిన అలంకారంగ ఆడదానికి భర్త ఒక్కడే. ఆ అలంకారాన్ని అతివలు జాగ్రత్తగా కాపాడుకోవాలి.

**125. సంభాషణ సంస్కారంతో ఉండాలి:**

ఆమ్నాయానామయోగేన విద్యాం ప్రశిథిలామివ।
సంస్కారేణ యథా హీనాం వాచమర్థాంతరం గతామ్॥ 19-11

వేదాధ్యయనం చేయకుండా సంపాదించిన ఏ విద్య అయినా సమగ్రతను సాధించలేదు. సంస్కారం లేకుండా ప్రయోగించిన మాట ఇతరమైన విపరీతార్థాలను గూడ ఇస్తుంది.

అశోకవనంలో శోకసాగరమగ్న అయిన జానకిని వర్ణిస్తున్నాడు ఆదికవి. వేదాధ్యయనం చేయకుండా, ఇతర విద్యను దేన్ని నేర్చినా అది దృఢంగా

ఉండదు. శిథిలావస్థలోనే ఉంటుంది. అలాగే శ్రీరామ సహయోగం లేని సీతాదేవి అలా ప్రశిథిలావస్థలో ఉందంటాడు వాల్మీకి మహర్షి. సంస్కార రహితమైన మాటకు అపార్థాలుగూడా చెయ్యవచ్చు. అలా స్నానలేపనాది సంస్కార రహితగా ఉన్నది సీతాదేవి అంటాడు. ఈ రెండింటివల్ల - వేదాధ్యయనం లేని విద్యలు సంపూర్ణమైనవి కావని, సంస్కారంలేని పదజాలాన్ని ప్రయోగించకూడదనే రెండు సత్యాలు తెలుస్తున్నాయి.

**126. చాపల్యం వల్ల చులకనై పోతారు :**

**అతుష్టం స్వేషు దారేషు చపలం చవితేన్ద్రియమ్।**
**నయంతి నికృతప్రజ్ఞం పరదారాః పరాభవమ్॥** 21-8

తన భార్యతో తృప్తిపడనివాణ్ణి, చపలచిత్తుణ్ణి, ఇంద్రియలోలుణ్ణి, ప్రజ్ఞాహీనుణ్ణి పరకాంతలు పరాభవిస్తారు.

స్త్రీ చాపల్యంవల్ల పురుషుడు సిగ్గులేనివాడవుతాడు. ఆడవాళ్ళను దూరంగా పెట్టగలిగినవాడే, అనుకున్నదాన్ని సాధించగలుగుతాడు. అలాంటప్పుడు స్వకాంతలతో తృప్తిపడక, పరకాంతల వెంట పడేవాడు, ఇంద్రియ చాంచల్యంతో ప్రజ్ఞాహీనుడైనవాడు పరాభవాన్ని పొందక తప్పదు. స్త్రీ జాతి వాణ్ణి చులకన చేస్తుంది. శారీరకంగా, మానసికంగా కూడా కుంగిపోతాడు. అతని జీవితం హాస్యాస్పదమౌతుంది.

**127. ఆచరణలేని జ్ఞానం అక్కఱకురాదు :**

**ఇహ సంతో న వా సంతి సతో వా నానువర్తసే।**
**తథా హి విపరీతా తే బుద్ధిరాచారవర్జితా॥** 21-9

ఇక్కడ సజ్జనులే లేరా ? ఉన్నా, వాళ్ల మాటలను నీవు వినడం లేదా ? ఆచరణలేని నీ జ్ఞానం తల్లకిందులుగా నడుస్తున్నది.

పతివ్రతామతల్లి సీతమ్మతల్లి లోకరావణుడైన రావణుణ్ణి మందలిస్తున్నది. ఈ పట్టణంలో అందరు నీలాంటివాళ్ళేనా? సన్మార్గంలో నడిచే సజ్జనులే లేరా ? లేక ఉన్నప్పటికీ వాళ్ళు చెప్పే హితోక్తులను నీవు అనుసరించడం లేదా ? ఎంతో జ్ఞానం కలవాడివి. ఏం ప్రయోజనం? ఆచరణ శూన్యమైన జ్ఞానం విపరీతంగానే ప్రసరిస్తుంది. వక్రమార్గాలనే అనుసరిస్తుంది. అందువల్ల మన కర్తవ్యం మనకు తెలియనప్పుడు పెద్దవాళ్ళ మాట తప్పక వినాలి.

**128. నీతి నియమాలు లేకపోతే :**

**అకృతాత్మాన మాసాద్య రాజానమనయే రతమ్।**
**సమృద్ధాని వినశ్యంతి రాష్ట్రాణి నగరాణి చ॥** 21-11

నీతి నియమాలు, ఆత్మ నిగ్రహంలేని రాజు పరిపాలనలో సర్వసమృద్ధులు సాధించిన నగరాలు, రాష్ట్రాలు కూడా సర్వనాశనమై పోతాయి.

రాష్ట్రాభివృద్ధి రాజుమీద ఆధారపడుతుంది. ఆ రాజుకు నీతి-నియమాలు, ఆత్మ నిగ్రహం లేకపోతే రాజ్యాన్ని సర్వనాశనం చేస్తాడు. ఇంతకుముందు సాధించిన అభివృద్ధులన్నీ అతనిచేతిలో పడి అకలానికలమైపోతాయి. అందువల్ల ఆత్మనిగ్రహంతో, రాజనీతి పరిజ్ఞానంతో రాజు పరిపాలన సాగిస్తేనే సమగ్రాభివృద్ధి రాష్ట్రంలోను, నగరాల్లోను సాధ్యమవుతుంది.

**129. పాపిష్ఠివాడు పోతే ప్రజలు సంతోషిస్తారు :**

**అభినన్దంతి భూతాని వినాశే పాపకర్మణః।** 21-13

ఒక పాపాత్ముడు నశించిపోయాడంటే, ప్రజలు ఎంతో సంతోషపడతారు.

నరకాసురుడు పోయినాడు. నరకచతుర్దశి జరుపుకుంటున్నాం. ప్రజలను పట్టి బాధించిన రాక్షసుడు నశించాడని నలుమూలలా దీపాలు వెలిగించుకుంటున్నాం. ఆ నందబాలుణ్ణి స్మరించుకుంటూ ఆనందదీపావళి జరుపుకుంటున్నాం. మహాత్ముడు అస్తమిస్తే మానవులంతా మతిలేని వాళ్ళవుతారు. అవాక్కులవుతారు. అయ్యో! అని అలమటిస్తారు. పదిమందినీ పీడించిన పాపాత్ముడు పతనమైపోతే ప్రజలు సంతోషిస్తారు. పీడ విరగడైందనుకుంటారు. పరస్పరం అభినందించుకొని పండుగ చేసుకుంటారు. అందుకే పదిమందికి చేతనైతే సహాయంచేసి జీవితాన్ని చరితార్థం చేసుకోవాలి. ఇతరులను పీడించడానికే మనం జీవించాల్సిన పనిలేదు. ఆ పని చేయడానికి అరణ్యంలో ఎన్నో ఘాతుక మృగాలు, మహాసర్పాలు ఉన్నాయి.

**130. రమ్మన్నప్పుడు మృత్యువు రానేరాదు :**

**లోకప్రవాదః సత్యోఽయం పండితైస్సముదాహృతః।**
**అకాలే దుర్లభో మృత్యుః స్త్రియో వా పురుషస్య వా॥** 25-12

'స్త్రీకిగాని, పురుషుడికిగాని కాలంగాని కాలంలో మృత్యువు రానేరాదని' పండితులుదాహరించే లోకప్రవాదం నిజమైందే.

లోకంలో ప్రతి జీవికి ప్రారబ్ధాన్ననుభవించడానికే జన్మ వస్తుంది. ప్రారబ్ధ కాలపరిమితినిబట్టి జీవితకాలం నిర్ణయింపబడుతుంది. ప్రారబ్ధకర్మ పూర్తిగా అనుభవించేదాకా ప్రాణం పొమ్మన్నా పోదు. ఆ అనుభవం పూర్తయిన తరువాత ఒక్క నిముషం ఆగమన్నా ఆగదు. మృత్యువు మానవుడి చేతిలో కీలుబొమ్మ కాదు-రమ్మన్నప్పుడు వచ్చి పొమ్మన్నప్పుడు పోవటానికి. మనిషిని ఆడిస్తుందేగాని, వాడు ఆడమన్నట్టు తను ఆడదు. వివేకంగలవాళ్ళు ప్రపంచాన్ని, జీవితాన్ని, మరణాన్ని అర్థం జేసుకొని తమ జీవితాలను సార్థకం చేసుకోవాలి.

**131.** **వాళ్ళే నిజంగా ధన్యులు :**

ధన్యాః ఖలు మహాత్మానో మునయస్త్యక్తకిల్బిషాః।
జితాత్మానో మహాభాగాః యేషాం న స్తః ప్రియాప్రియే॥26-49

మనోనిగ్రహంతో మహాత్ములు తమ పాపాలను పోగొట్టుకుంటారు. నిజంగా వారికి ప్రియమైందిగాని, అప్రియమైందిగాని లేదు. వారెంతో అదృష్ట వంతులు, ధన్యాతిధన్యులు.

మనో నిగ్రహాన్ని 'శమం' అంటారు. మనస్సు మన చేతుల్లో ఉంటే మనం సాధించలేనిదేముంటుంది ? మనస్సును స్వాధీనపరచుకున్న మహాత్ములు శమ ప్రధానమైన జీవితాలను గడుపుతూ, పాపాలను పటాపంచలు చేసుకుంటారు. నిజంగా వాళ్లెంత ధన్యులో ! వాళ్లకు ఈ ప్రపంచంలో అంతా ప్రియమైందే; ప్రత్యేకంగా కొన్నింటిమీద ఇష్టం, కొన్నింటిమీద అయిష్టం వాళ్లకుండదు. అలాంటిస్థితికి ప్రతివాడు చేరాలంటే భగవాన్ అనుగ్రహం కావాలి. వ్యక్తిగతమైన సాధన కావాలి. ఆ స్థితికి చేరినవాడికి ఎప్పుడూ ఆనందమేగాని దుఃఖమే ఉండదు. అబ్బ ! వాళ్లెంత అదృష్టవంతులు !

**132.** **అలాంటి మహాత్ములకు నమస్కారం :**

ప్రియాన్న సంభవేద్దుఃఖం అప్రియాదధికం భయమ్,
తాభ్యాం హి యే వియుజ్యన్తే నమస్తేషాం మహాత్మనామ్॥
26-50

ఇష్టమైన వస్తువు తనకు లేదే అన్న బాధగాని, ఇష్టంలేని భయంగాని మహాత్ములకుండదు. ఎందుకంటే వాళ్ళకు ఇష్టాఇష్టాలుండవు గనుక. అటువంటి మహానుభావులకు నమస్కారం.

**133.** ఎప్పుడూ కష్టాలే ఉండవు :

ఏతి జీవ న్తమానందో నరం వర్ష శతాదపి । 34_6

[బతికి ఉన్నవాడికి నూరు సంవత్సరాలకైనా ఆనందం కలిగి తీరుతుంది.

కొంతమంది కష్టాలతో కన్నీళ్ళతో, కరిగిపోతుంటారు. సంసార సాగరంలో ఒక కెరటాన్ని తట్టుకొని నిలబడగలిగామనుకుంటుండగానే ఇంకో కెరటం వచ్చి ఊపేస్తుంటుంది. నిరాశ, నిస్పృహలు నిలవనీయవు. చిట్టచివఱకు జీవితం మీదనే ఛీ! ఛీ! అనిపిస్తుంది. రోత వేస్తుంది. కాని అవే కష్టాలు ఎల్లకాలం ఉండవు. చీకటిరోజులు పోయి వెన్నెల రోజులూ మళ్ళీ వస్తాయి. ఎన్ని సంవత్సరాలకైనా ఇన్ని కష్టాలలో మగ్గినవాడు మళ్ళీ మహానందాన్ని అనుభవించే రోజులొస్తాయి. ఓర్పుతో, నేర్పుతో వ్యవహరించడం నేర్చుకోవాలి. ఆశాజనకమైన భవిష్యత్తుకోసం ఆనందంగా ఎదురుచూడాలి.

**134.** ఏ పరిస్థితుల్లోను విధి వెంటనే ఉంటుంది :

ఐశ్వర్యే వా సువి స్తీర్ణే వ్యసనే వా సుదారుణే,
రజ్జ్వేవ పురుషం బద్ధ్వా కృతా న్తః పరికర్షతి॥ 37_3

గొప్ప ఐశ్వర్యం ఉన్నకాలంలో గాని, నిష్టదరిద్రం అనుభవిస్తున్నప్పుడు గాని తాడుపెట్టి కట్టినట్లు అదృష్టం అందఱినీ అంటిపెట్టుకొనే ఉంటుంది.

విధి ఏ విధంగాను మనల్ని వదిలివెళ్ళదు. చేసుకొచ్చిన అదృష్టం చేతికొచ్చిన సంతానంలాగా ఎప్పుడూ తోడుగానే వస్తుంటుంది. భోగభాగ్యాలను అనుభవించే భోగ్యమైన కాలంలో గాని, దారిద్ర్యంతో అలమటించే దయనీయమైన సమయంలోగాని మానవుణ్ని తాటితో బంధించినట్లు తనవెంట లాక్కువెడుతుంది. కనుక అదృష్టాధీనమైన జీవితాన్ని అనుభవిస్తున్న మానవుడు తానేదో చేసేస్తానని అహంకారపడటం అంతా వట్టి బూటకం. విధి తలచినట్లు జరుగుతుందేగాని నిధి తలచినట్లు జరుగనే జరుగదు.

**135.** దయను మించిన ధర్మం లేదు : 38_41

ఆనృశంస్యం పరో ధర్మః।

ధర్మాలన్నింటికంటే భూతదయ గొప్పధర్మం.

తోటి జీవరాసులన్నింటిలో భగవంతుడున్నాడు. నీవు ఏ జీవిని హింసించినా అది భగవంతుణ్ణి బాధించినట్లే. ఏ జీవికి సేవ చేసినా అది భగవంతునికే చేరుతుంది. ఇతర ప్రాణులను హింసించే అధికారం నీకు లేదు. వాళ్ళకు దయతో సేవ చేయగలగడం గొప్ప భాగ్యంగా భావించు! అందుకే దయను మించిన ధర్మం లేదని పెద్దలు చెబుతారు.

**136. చిన్నవాణ్ణే దూతగా పంపాలి :**

నహి ప్రకృష్టాః ప్రేష్యన్తే ప్రేష్యన్తే హీతరే జనాః। 39-39

అన్నిరకాల శక్తిసామర్థ్యాలున్నవాణ్ణి దూతగా పంపగూడదు. కొంచెం తక్కువవాణ్ణే పంపాలి.

శత్రువు దగ్గఱికి రాయబారం పంపేటప్పుడు తన పక్షంలో ఉన్న సమర్థులందఱిలో తక్కువవాణ్ణే పంపమంటుంది రాజనీతి. 'వీడే ఇంతటి శక్తిగలవాడు; ఇంకా ఎంతమంది సమర్థులు ఆ పక్షంలో ఉన్నారో' అని శత్రువుకు అది కొంత భయానికి కారణమౌతుంది. అలాకాక శత్రువు దూతను బంధిస్తే తన పక్షంలో సమర్థుడైనవాడు ఒకడు లోపిస్తాడు. పక్షం బలహీనమౌతుంది. అందువల్ల రాజనీతిననుసరించి తెలివితేటలు గలిగి సమర్థులైన సమర యోధులలో తక్కువవాణ్ణే రాయబారిగా పంపడం మంచిది.

**137. చూచి రమ్మంటే కాల్చి వస్తాడు :**

కార్యే కర్మణి నిర్దిష్టే యో బహూన్యపి సాధయేత్।
పూర్వకార్యావిరోధేన న కార్యం కర్తుమర్హతి॥ 41-5

ఫలాన పని చేసుకు రమ్మని చెప్పిన తరువాత దానికి విరోధం లేకుండా ఇంకెన్నో కార్యాలు సాధించేవాడు ఏ పనైనా అవలీలగా పూర్తిచేస్తాడు.

కొందఱికి ఏదైనా పని చెప్పాలంటే భయం. వాళ్ల అతి తెలివి తేటలతో ఎక్కడ దాన్ని తగులబెట్టేస్తారోనని. అసలుపనిని చెడగొట్టి పక్కపనులు సాధించే వాళ్ళు చాలా మంది ఉంటారు. కానీ చెప్పిన పనిని చెక్కు చెదరకుండా సాధించే వాళ్ళు కొద్దిమందే ఉంటారు. కొంతమంది పని అప్పగించిన వాళ్ళ అంతర్యం తెలుసుకొని చెప్పిన పనిని చేసుకురావటంతోపాటు ఇంకా కొన్ని పనులు కూడా చక్కబెట్టుకు వస్తారు. అలాంటి వాళ్ళకు సమయస్ఫూర్తి, దేశకాల జ్ఞానం, ఔచిత్యం, అన్నీ కరతలామలకంగా ఉంటాయి. వాళ్ళకు ధైర్యంగా

ఏ పనైనా అప్పగించవచ్చు. నూటికొక్కడో, కోటికొక్కడో అలాంటివాడు దొరుకుతాడు. 'యోగః కర్మసు కౌశలమ్' అని గదా గీతాసూక్తి. !

**138. పాముసడక పాముకే తెలుస్తుంది :**

అహిరేవ హ్యహేః పాదాన్ విజానాతి న సంశయః। 42_9

పాము నడక ఇతరులకు తెలియదు. ఇంకో పాము ఎలా వెళ్ళింది, ఎటు వెళ్ళింది పాముకే తెలుస్తుంది. ఇందులో సందేహం లేదు.

గూఢచార వ్యవస్థను గురించి గూఢచారికే తెలుస్తుంది గాని సామాన్య మానవుడికి తెలియనే తెలియదు. మంత్రాలోచనాన్ని గురించి మంత్రిమండలికే తెలుస్తుంది గాని అందఱికీ తెలియదు. తప్పుడు పనులు చేసేవాళ్ళ స్థితిగతులు తప్పుడు పనులు చేసేవాళ్ళకే తెలుస్తాయి గాని ఇతరులకు తెలియదు. దొంగల స్థావరాలను గురించి దొంగలకే తెలుస్తుంది గాని దొంగ కాని వాడికెలా తెలుస్తుంది? పాము నడకను గురించి, వాటి నివాసాన్ని గురించి పాములకే తెలుస్తుంది గాని మిగతా వాళ్ళకు తెలియదు. రహస్య సమాచారాలను గురించి రాబట్టాలంటే ఆ గుంపులో వాడి ద్వారానే ప్రయత్నించాలి గాని బయట వాళ్ళ వల్ల తెలుసుకోవడం చాలా కష్టం.

**139. కోటికొక్కడే కోపాన్ని జయిస్తాడు :**

ధన్యాస్తే పురుషశ్రేష్ఠా యే బుద్ధ్యా కోపముత్థితమ్,
నిరున్ధన్తి మహాత్మానో దీప్తమగ్నిమివాంభసా॥ 55_4

నీళ్ళతో నిప్పును చల్లార్చినట్లు పెచ్చు పెరిగిపోయే కోపాన్ని వివేకంతో నిరోధించగల మహాత్ములే పురుషోత్తములు, ధన్యాతిధన్యులు.

కోరికలనైనా జయించవచ్చుగాని కోపాన్ని జయించడం చాలా కష్టం. దానికి ఎంతో సహనం, సాధన కావాలి. కోపాన్ని నిరోధించినవాడు సాధించలేనిదేదీ ఉండదు; జయించలేనివాడూ ఎవడూ ఉండడు. ఒక్కసారి కోపాగ్ని ప్రజ్వరిల్లితే ఆ శరీరంలో రక్తం సలసలా కాగిపోతుంది. అది చల్లారడానికి మూడు నెలలు పడుతుంది. ఈ లోపల ఎన్ని అనారోగ్యాలో దానివల్ల ఏర్పడతాయి. కోపంవల్ల త్వరగా ముసలితనం వస్తుంది. మఱి క్షణక్షణానికి కోపం వచ్చే వాళ్ల గతి ఏమిటో వాళ్ళే ఆలోచించుకోవాలి. ప్రయత్నపూర్వకంగా కోపాన్ని జయించినవాళ్ళు ఎంతో ధన్యులు. భగభగమండే మంటలను నీళ్ళతో

చల్లార్చినట్లు కోపాగ్నిని సహనజలంతో చల్లార్చివేయాలి. అలా ఎవడో కోటి కొక్కడు చేయగలుగుతాడు.

**140. కోపోద్రేకం కొండంత తప్పును చేయిస్తుంది :**

క్రుద్ధః పాపం నకుర్యాత్కః క్రుద్ధో హన్యాద్గురూనపి,
క్రుద్ధః పరుషయా వాచా నరః సాధూనధిక్షిపేత్॥ 55-5

క్రోధంలో ఉన్నవాడు గురువులనైనా చంపుతాడు. పరుషమైన మాటలతో మహా పురుషులను గూడా అవమానిస్తాడు. అయినా క్రోధాగ్నితో మండిపడేవాడు ఏ పాపం చేయలేడు ?

క్రోధంతో ఒళ్ళు తెలియకుండా ఉన్నవాడు ఏ తప్పైనా చేస్తాడు. కార్యాకార్య విచక్షణ అతడిలో శూన్యమవుతుంది. ఎంతటి పాపాన్నైనా చేయడానికి వాడు వెనుకాడడు. గురువునైనా చంపడానికి సిద్ధపడతాడు. సాధువులను, సజ్జనులను పరుషభాషణంతో అవమానిస్తాడు. ఇంతెందుకు ? పిచ్చివాడిలా తయారై, రెచ్చిపోయి ఏ పాపాన్నైనా చేయడానికి తెగిస్తాడు. అందువల్ల క్రోధాగ్నిని రాజుకోనీకూడదు. వివేక-సహనాలనే జల్లులతో పూర్తిగా దాన్ని ఆర్పివేయాలి.

**141. ఓర్పుతో కోపాన్ని నిర్జించు :**

**యస్యముత్పతితం క్రోధం క్షమయైవ నిరస్యతి,**
**యథోరగ స్త్వచం జీర్ణాం స వై పురుష ఉచ్యతే॥ 55-7**

పెల్లుబికివచ్చే కోపాన్ని పాము కుబుసం విడిచినట్లు ఓర్పుతో జయించాలి. అలా చేయగలవాడే నిజమైన పురుషుడు.

కోపం రానే రాకూడదు. వస్తే మన వొళ్లు మనకే తెలియదు. అనుకోకుండా అనర్థకరమైన మాటలు మాట్లాడతాం. అనుబంధాల తెగిపోతాయి. మరి దీన్ని జయించాలంటే ఏం చేయాలి ? సహనాన్ని పెంచుకోవడానికి సాధన చేయాలి. పాము తన కుబుసాన్ని వదిలిపెట్టినట్లు కోపాన్ని మానవుడు వదిలిపెట్టాలి. అందుకు ఒకే ఒక మార్గం—ఓర్పు. ఎవరైనా తనను దూషించినప్పుడో, విమర్శించినప్పుడో సహజంగా కోపం వస్తుంది. అప్పుడు సమాధానం చెప్పకుండా అక్కడినించి లేచి వెళ్ళిపోవాలి. అయినా ఆ కోపం తగ్గకపోతే కొంచెం

మంచి నీళ్ళు తాగాలి. అప్పటికీ శాంతి కలగకపోతే ప్రకృతిని చూస్తూ కొంత దూరం నడవాలి. అప్పుడు తప్పకుండా కోపం మన స్వాధీనంలోకి వస్తుంది. అలా కోపాన్ని జయించినవాడే గొప్పవాడు.

# యుద్ధకాండ

**142. ఉపేక్షించడం ఉచితం కాదు :**

**గుణదోషావనిశ్చిత్య త్యక్త్వా ధర్మవ్యపాశ్రయమ్।**
**కరిష్యామీతి యః కార్యముపేక్షేత్స నరాధమః॥** 6-10

గుణదోషాలను విమర్శించకుండా, ధర్మాన్ని వదిలిపెట్టి, లెక్కలేనితనంతో ఎవడు కార్యాన్ని ఉపేక్షిస్తారో వాడే నరాధముడు.

ఒక పని చేస్తానని ఒప్పుకున్న తరువాత దాన్ని ఎలాగైనా పూర్తిచేయడానికి ప్రయత్నించాలి. అందులో మంచిచెడ్డలను గమనించకుండా, ఇచ్చినమాటను వదిలేసి, దానిమీద ఆదరం లేకుండా ఉపేక్షచేస్తే ఎంతో అధర్మమౌతుంది. అలా చేసినవాడు మాటను నిలబెట్టుకోలేనివాడు. అతణ్ని ఎవరూ అభినందించరు. కనుక ఏ పనైనా అంగీకరించిన తరువాత ఉపేక్ష చేయకుండా ఉత్సాహంతో పూర్తిచేయడం ధర్మం.

**143. పరస్త్రీలకోసం పాకులాడకూడదు :**

**అయశస్యమనాయుష్యం పరదారాభిమర్శనమ్।**
**అర్థక్షయకరం ఘోరం పాపస్యచ పునర్భవమ్॥** 9-15

పరాయి స్త్రీలకోసం పరుగులెత్తడంవల్ల కీర్తి ప్రతిష్ఠలు మంటగలుస్తాయి. ఆయుష్యం క్షీణిస్తుంది. సిరిసంపదలు నశిస్తాయి. కొత్త పాపాలు చుట్టుకుంటాయి.

తృప్తిపడటంలో సంతోషం ఉంది. తృప్తిలేనివాడి జీవితం నరకప్రాయం. భౌతికసుఖాల్లో తృప్తిపడటం నేర్చుకోవాలి. అందులోను స్త్రీలపైన వాంఛ ఎంత తగ్గించుకుంటే అంత మంచిది. అలా కాకుండా స్వకాంతలతో తృప్తిపడకుండా పరకాంతలకోసం పాకులాడటంవల్ల అతడి కీర్తి ప్రతిష్ఠలు, ఆయుష్యం, ఆరోగ్యం, ఆస్తిపాస్తులు నశించడమే గాకుండా, ఇంతకుముందున్న పాపాలుగాక కొత్త పాపాలు కూడా చుట్టుకుంటాయి. అందువల్ల అలాంటి విషయాల్లో జాగ్రత్తగా మసలుకోవాలి.

**144.** ముందువెనుకల్లో తొందరపడకూడదు :

యః పశ్చాత్పూర్వకార్యాణి కర్మాణ్యభిచికీర్షతి।
పూర్వం చాపరకార్యాణి న స వేద నయానయౌ॥ 12-32

ఏ పని ముందు చేయాలి, ఏ పని తరువాత చేయాలనే విషయాన్ని నిర్ణయించుకోకుండా ముందు చేయాల్సిన పనులను వెనక, వెనక చేయాల్సిన పనులను ముందు ఎవరు చేయాలనుకుంటారో వాళ్ళకు రాజనీతి తెలియనే తెలియదని చెప్పాలి.

ప్రజలను మెప్పిస్తూ పరిపాలించడం అందరికీ కుదిరే విద్యకాదు. అందులో ఎన్నో ఇబ్బందులున్నాయి. కొత్త సంస్కరణలను ప్రవేశపెట్టేటప్పుడు, పాతవాటిని రద్దుచేసేటప్పుడు, రాజ్యాధికారులను విభాగంచేసేటప్పుడు బాగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. తీసుకున్న నిర్ణయాలను ఏది ముందు? ఏది వెనుక? అని ఆలోచించి అమలుపరచాలి. ముందు పనులు వెనుక, వెనక పనులు ముందు చేస్తే ఆ రాష్ట్రం వృద్ధికిరాదు. ఆ రాజు ఎక్కువకాలం నిలవడు.

**145.** సమీక్షించి సలహా ఇవ్వాలి :

పరస్య వీర్యం స్వబలం చ బుధ్వా
స్థానం క్షయం చైవ తథైవ వృద్ధిమ్।
తథా స్వపక్షేఽప్యనుమృశ్య బుధ్యా
వదేత్ క్షమం స్వామిహితం చ మన్త్రీ॥ 14-22

శత్రుబలాన్ని తమ బలాన్ని, ఉభయపక్షాల స్థానాన్ని, వృద్ధిక్షయాలను బాగా ఆలోచించి స్వామిహితాన్ని కోరి రాజుకు మంత్రి సరైన సలహాలనివ్వాలి.

అత్యవసర పరిస్థితిలో అమాత్యుడు రాజుకు సలహా ఇవ్వవలసి వచ్చినప్పుడు శత్రువుల శక్తిసామర్థ్యాలను చక్కగా పరిశీలించాలి. రెండు పక్షాల స్థితిగతులను, వృద్ధిక్షయాలను అన్ని కోణాలనుంచి బాగా సమీక్షించి, రాష్ట్రానికి రాజుకు మంచి కలిగేటట్లు తగిన సలహా నివ్వాలి అంతేకాని దొరికాడు గదా! అని రాజును పెడదోవ పట్టించి, రాష్ట్రాన్ని గందరగోళం పట్టించే సలహాల నివ్వకూడదు.

**146.** శత్రుసేవకునితో స్నేహం పనికిరాదు :

వసేత్సహ సపత్నేన క్రుద్ధేనాశీవిషేణ వా।
న తు మిత్రప్రవాదేన సంవసేచ్ఛత్రుసేవినా॥ 61-2

విరోధితో గాని, పగబట్టిన పాముతోగాని కలిసి ఉండచ్చు. కానీ స్నేహితుడనే ముసుగులో దగ్గరకు చేరిన శత్రుసేవకునితో మాత్రం కలసి స్నేహం చేయకూడదు.

మన దగ్గర అతి వినయాన్ని ప్రదర్శిస్తూ, అనుకూలుడులాగా అభినయం చేస్తూ, అవసరమైన రహస్య సమాచారాన్ని సేకరించి, శత్రువుకు గూఢచారిగా పనిచేస్తూ ఉండేవాడితో ఎలాంటి స్నేహమూ చేయకూడదు. ప్రబల శత్రువుతోను పగబట్టిన పాముతోను కలసి ఉండచ్చుగాని శత్రు గూఢచారిగా వచ్చి, మిత్రుడనే పేరుతో హానిచేయడానికి కాచుకొని కూర్చున్నవాడితో మాత్రం కలసి ఉండ కూడదు. వాడు నమ్మించి ద్రోహం చేస్తాడు.

**147. అంటీ అంటని స్నేహం :**

**యథా పుష్కరపర్ణేషు పతితాస్తోయబిందవః।**
**న శ్లేషముపగచ్ఛన్తి తథాఽనార్యేషు సంగతమ్॥ 16-11**

తామరాకుపైన నీటి బొట్లు పడి తళతళ మెరుస్తుంటాయి. కాని ఆకుకు ఏ కొంచెం అతుక్కోవు. అయోగ్యులతో కలిసినా అలాగే ఉండిపోవాలి.

యోగ్యతాయోగ్యతలు తెలియందే ఎవరితోను స్నేహం చెయ్యకూడదు. ఒకవేళ అవతలి వ్యక్తి యోగ్యుడు కాదని తెలిసినా, తప్పనిసరి పరిస్థితుల్లో స్నేహం చేయవలసివస్తే; అంటీ అంటనట్లు స్నేహాన్ని నటించాలే గాని విశ్వాస పూర్వకంగా చేయకూడదు. తామరాకు నీళ్లపైన తేలి ఆడుతూ ఉంటుంది. నీళ్ల బొట్లు కొన్ని దానిపైన పడినా అక్కడే అతుక్కొనిపోవు. తిరిగి మళ్లా జలజలా రాలిపోతాయి అలాగే అయోగ్యులతో స్నేహం చేసినా, అంటీ అంటనట్లు ముట్టీ ముట్టనట్లు ఉండాలేగాని పూర్తిగా అతుక్కుపోకూడదు.

**148. అయోగ్యులతో స్నేహం అశాభంగాన్ని కలిగిస్తుంది :**

**యథా పూర్వం గజః స్నాత్వా గృహ్యా హస్తేన వై రజః।**
**దూషయత్యాత్మనో దేహం తథాఽనార్యేషు సౌహృదమ్॥ 11-16**

ఏనుగు స్నానం చేసిన తరువాత కూడా తుండంతో దుమ్మును పీల్చి ఒంటినిండా ఎలా పూసుకుంటుందో, సంస్కార రహితులతో చేసే స్నేహం అలాగే నిష్ప్రయోజనంగా పరిణమిస్తుంది.

లోకాన్ని మభ్యపెట్టి మంచివాళ్ళలాగా కనపడుతుంటారుకొందరు. వాళ్లు నిజంగా మంచివాళ్లే ననుకొని, అమాయకులు కొందరు వాళ్ల వలలో చిక్కుకుపోతారు. వాళ్ళతో స్నేహం మొదలైన తరువాత ఒక్కొక్క అయో

గ్యతే బయటపడుతుంది. ఏనుగు నదిలో దిగి స్నానం చేస్తుంది. జలకాలు ఆడు తుంది. కానీ ఏం ప్రయోజనం? బయటకు వచ్చి దుమ్మునంతా తుండంతో లాక్కొని మీద చల్లుకుంటుంది. అలాగే మనలో ఎన్ని పవిత్ర భావాలున్నా అయోగ్య సంపర్కం వల్ల అవన్నీ కలుషితమైపోతాయి. వాళ్లు మనల్ని చివరిదాకా నమ్మించి, మోసం చేస్తారు. అందువల్ల అలాంటి వాళ్ళతో చాలా జాగ్రత్తగా ఉండాలి.

**149. మంచిగా ఉన్నట్టే పొంచిఉండి దెబ్బతీస్తారు :**

**ఛాదయిత్వాఽఽత్మభావం హి చరన్తి శఠ బుద్ధయః।**
**ప్రహరన్తి చ రంధ్రేషు సోఽనర్థః సుమహాన్ భవేత్॥ 17-38**

దుర్మార్గులు దురుద్దేశ్యాల్ని లోపలే దాచుకొని, పైపైకి తియ్యగా మాట్లాడుతూ పొంచి ఉండి సమయం దొరికినప్పుడు సర్వనాశనం చేస్తారు. ఆ అనర్థాన్ని తట్టుకోవడం చాలా కష్టమౌతుంది.

నయవంచకులు నక్కజిత్తులను ప్రదర్శిస్తూ నమ్రతతో దగ్గఱకు చేరుతారు. అసలు స్వరూపాన్ని బయటపెట్టకుండా లోపలే దాచుకొని పైపైకి అనుకూలంగా ఉంటూ లోలోపల గోతులు తవ్వుతుంటారు. పొంచి ఉండి అవకాశం దొరికిన వెంటనే మనల్ని సర్వనాశనం చేస్తారు. వాళ్ళు కలిగించిన అనర్థాన్ని తట్టుకొని మళ్లా నిలబడటం కష్టతరమైన పని. అందువల్లనే మన చుట్టూ ఉన్న వాళ్ళపైన గూఢచారుల ద్వారా నిఘావేసి పెట్టాలి

**150. పని ఇస్తేనే పనితనం తెలుస్తుంది :**

**ఋతే నియోగాత్సామర్థ్య మవబోద్ధుం నశక్యతే।**
**సహసా వినియోగో హి దోషవాన్ప్రతిభాతి మే॥ 17-52**

ఏదో ఒక పని పురమాయించకుండా ఎవరిశక్తిసామర్థ్యాలు ఎవరూ గ్రహించలేరు. కానీ అతడి యోగ్యతాయోగ్యతలు. సామర్థ్యం తెలుసుకోకుండా పని చెప్పడమూ మంచిపని కాదు.

ఈ వ్యక్తి సమర్థుడా? అసమర్థుడా? అనే అంశం తెలియాలంటే అతని కొక పని అప్పగించి చూడాలి. చెప్పినపని బాగా చేస్తే నిజంగా అతడు సమర్థుడేనని నమ్మవచ్చు. కానీ అతని సామర్థ్యం తెలియకుండా పని చెప్పటంకూడా మంచిది కాదు. ఇది 'పెళ్ళి కుదిరితేగాని పిచ్చి కుదరదు; పిచ్చి కుదిరితేగాని పెళ్ళి కుదరదు' అన్నట్లు అన్యోన్యాశ్రయంగా ఉంది. అయితే చిన్నపని చెప్పి దాన్ని బాగాచేస్తే పెద్దపనిని అప్పచెబితే ఏ రకమైన ప్రమాదమూ ఉండదు

**151.** శరణాగతుణ్ణి కరుణించాలి :

బద్ధాంజలిపుటం దీనం యాచన్తం శరణాగతమ్।
న హన్యాదానృశంస్యార్థం అపి శత్రుం పరంతప॥ 18-27

దీనుడై అంజలి ఘటించి 'శరణు శరణు' అని ప్రాధేయపడుతున్నప్పుడు శత్రువునైనా దయతో కాపాడాలి.

శరణు పొందినవాడు ఎవడైనా సరే, చివరకు శత్రువైనా సరే జాలితో తప్పక వాణ్ణి కాపాడాలి శరణాగతుణ్ణి క్షమించడం ఉత్తమధర్మం. దురహంకారంతో ఎదిరించినవాణ్ణి చావుదెబ్బలు కొట్టినా, దీనావస్థలో కాపాడమని దోయిలి ఒగ్గినవాణ్ణి తప్పక కరుణతో కాపాడటమే మానవత్వం అనిపించుకుంటుంది.

**152.** అన్ని మంచిగుణాలైతే అసమర్థుడంటారు :

ప్రశమశ్చ క్షమా చైవ ఆర్జవం ప్రియవాదితా।
అసామర్థ్యం ఫలన్త్యేతే నిర్గుణేషు సతాం గుణాః॥ 21-15

సజ్జనులలో ఉండే ప్రశాంతత, ఓర్పు ఋజుత్వం, మంచిగా మాట్లాడటం అనే గుణాలను దుర్మార్గులు అసమర్థత క్రింద పరిగణిస్తారు.

సత్త్వగుణంతో సమస్థితిలో పోతూ ఉన్న సజ్జనులను ఈ సమాజం అసమర్థుల క్రింద లెక్క వేస్తుంది. ప్రశాంతి, సహనం, ఋజుప్రవృత్తి, శాంతంగా మాట్లాడటం మొ॥ లక్షణాలను చూచి దుర్మార్గులనుకుంటారు- 'ఇతడు అసమర్థుడు కాబట్టి ఇలా ఉన్నాడు. సమర్థుడైతే ఈపాటికి కార్యాన్ని సాధించే ఉండేవాడు కదా !' కానీ ఆడంబరాలకు, అట్టహాసాలకు పోకుండా నిదానంగా కార్యాన్ని సాధించిన తరువాత తెలుసుకుంటారు ఇతడూ సమర్థుడేనని. ఈ లోకం పటాటోపాలకు ప్రాధాన్యం ఇస్తుందే కాని పని తీరుకు మాత్రం కాదు.

**153.** స్త్రీకి వైధవ్యమే మరణం:

ప్రథమం మరణం నార్యా భర్తుర్వైగుణ్యముచ్యతే। 32-9

భర్తృ వియోగమే భార్యకు మొదటి మరణం.

స్త్రీ జీవితానికి ప్రధానమైన అలంబనం పతి. అతడున్నంతవరకే ఆమె జీవితం ఉన్నట్లు లెక్క. అతడు అస్తమిస్తే అదే ఆమెకు కూడా మొదటి మరణం అవుతుంది. మిగిలిన రోజులు జీవచ్ఛవంలాగా బ్రతకవలసిందే. ఆ దృక్పథం తోనే ఒకప్పుడు సతీసహగమనం అమలులో ఉండేది ఏదిఏమైనా స్త్రీ జీవితంలో వైధవ్యమే మొదటి మరణం అవడంలో ఎంతో అర్థగాంభీర్యం ఉంది.

**154.** మూడు యుక్తులతో ముల్లోకాలను జయించవచ్చు:

సదధానో హి కాలేన విగృహ్ణాంశ్చారిభిస్సహ।
స్వపక్షవర్ధనం కుర్వన్మహదైశ్వర్య మశ్నుతే॥ 35-8

తనతో పోరాడే శత్రువులు బలవంతులైనప్పుడు కాలానుగుణంగా వారితో సంధి చేసుకోవాలి. తరువాత తన బలాన్ని అన్ని విధాలా పెంచుకోవాలి. సమయం చూసి శత్రువులను జయించి సామ్రాజ్యాన్ని స్థాపించాలి. అలాంటి రాజే అన్నింటిని సాధిస్తాడు.

రాజ్య నిర్వహణం చేసే రాజుకు మూడు యుక్తులు ముఖ్యంగా ఉండాలి. తనకెదురులేదని ఎప్పుడూ ఎత్తిన తల దించననుకుంటే ప్రయోజనం లేదు. విధి వక్రించినప్పుడు యుక్తియుక్తంగా నడుచుకోవటం ఎంతో ఉచితమైన రాజనీతి. శత్రుబలం హెచ్చుగా ఉన్నప్పుడు సంధి చేసుకోవాలి. తన చతురంగ బలాలన్ని బాగా పెంచుకొని సమయం కోసం ఎదురుచూస్తూ ఉండాలి. అదునులో మళ్ళా యుద్ధంచేసి రాజ్యాన్ని కట్టుదిట్టంగా విస్తరింప చేసుకోవాలి. ఇలాంటి రాజనీతితో నడిస్తే అపజయమే లేకుండా పోతుంది.

**155.** ఏది కృతయుగం? ఏది కలియుగం?

ధర్మోవై గ్రసతేఽధర్మం తతః కృతమభూద్యుగమ్,
అధర్మో గ్రసతే ధర్మం తతస్తిష్యః ప్రవర్తతే॥ 34-14

ధర్మం అధర్మాన్ని మింగేసిన రోజులకు కృతయుగమని పేరు అధర్మం ధర్మాన్ని మింగుతున్న ఈ రోజులకు కలియుగమని పేరు.

కృతయుగానికి ఏమిటి లక్షణం? అధర్మం అక్కడక్కడా తలఎత్తితే; ప్రబలమైన ధర్మం దాన్ని రూపుమాపిన రోజులను కృతయుగమన్నారు. ధర్మం నాలుగు పాదాలా నడిచిన రోజులవి. కాలం మారింది. ధర్మం ఎక్కడైనా కన బడితే అధర్మం దాన్ని మింగేసే కాలాన్ని కలియుగం అన్నారు. ధర్మధేనువు ఒంటికాలిపై తపస్సు చేస్తున్న రోజులివి. యుగధర్మం మారిపోతుంటుంది కాని శాశ్వతంగా ఉండదు.

**156.** ఒక్కడివల్ల అందఱూ నశిస్తారు?

ఏకో హి కురుతే పాపం కాలపాశవశం గతః।
నీచే నాత్మాపచారేణ కులం తేన వినశ్యతి॥ 38-7

విధిచేతిలో చిక్కి ఒక్క నీచుడు చేసిన పాపానికి, అతని కులమంతా నశిస్తుంది.

దురదృష్టం తరిమికొట్టడం వల్ల. ఒక్క దుర్మార్గుడు చేసిన తప్పుకు ఫలితాన్ని వాడి కులమంతా అనుభవించాల్సి వస్తుంది ఊరికి నిప్పుపెట్టే వాడొక్కడైనా ఇళ్లు కాలిపోయి గ్రామస్థులంతా ప్రాణ నష్టానికి, ధన నష్టానికి గురైనట్లు; తప్పుచేసేది ఒక్కడైనా ఫలితం ఆ ఒక్కడే అనుభవించడు. ఊళ్ళో ఉన్న వాళ్ళంతా అనుభవిస్తారు. అందువల్లనే నీచుణ్ణి తమ మధ్యలో లేకుండా చూసుకోవాలి.

**157.** **సత్య ధర్మాలుంటే చావంటే భయముండదు :**

సత్యధర్మాభియుక్తానాం నాస్తి మృత్యుకృతం భయమ్। 46-34

సత్యాన్ని, ధర్మాన్ని అంటిపెట్టుకొన్నవాళ్ళను మృత్యుదేవత భయపెట్టలేదు.

మన ప్రవృత్తి సత్యధర్మాలకు అంకితమైన ప్రపంచాన్ని చూసి భయపడవలసిన పని ఉండదు. సత్యం శాశ్వతమైన లక్షణం. ధర్మాచరణం మనకు ధైర్యాన్ని ఇస్తుంది. ఈ జీవితం అశాశ్వతమని ఈ రెండూ తెలియజేస్తాయి. కాబట్టే ఈ రెంటిని అనుసరించేవాడికి మరణమంటే భీతి ఉండదు. నిత్యమైన ఆత్మ, అనిత్యమైన శరీరాన్ని వదిలేస్తున్నదని అర్థం చేసుకోగలుగుతాడు.

**158.** **నకిలీ నాయకులను నమ్మకూడదు :**

**అహితం చ హితాకారం ధార్ష్ట్యాజ్జల్పన్తి యే నరాః।**

**అవేక్ష్య మన్త్రిబాహ్యాస్తే కర్తవ్యాః కృత్యదూషణాః॥ 63-16**

పైకి మంచిగా కనపడే చెడ్డ పథకాన్ని రాజుకు చెప్పి అతణ్ణి తప్పుదోవ పట్టించి రాజ్యంలో ఆందోళనలను రేకెత్తిస్తారు కొందరు నీచులు. జాగ్రత్తగా వాళ్లను గుర్తించి మంత్రిపదవి నుంచి తప్పించాలి. లేకపోతే రాజ్యమే నాశనమౌతుంది.

స్వార్థంతో రాజును తప్పుదోవ పట్టించడానికి ప్రయత్నిస్తారు కొందరు. ప్రజలకు ఇది చాలా మంచిదని బోధచేసి, బలవంతంగా రాజుచేత దాన్ని అమలు చేయించి రాష్ట్రంలో అలజడి కలిగిస్తారు. రాజుకు పదవీచ్యుతిని కలిగిస్తారు. అలాంటి వాళ్ళను జాగ్రత్తగా కనిపెట్టి మంత్రిమండలి నుంచి బహిష్కరించాలి. అలాకాకపోతే అసలుకే మోసం వస్తుంది.

**159** **శత్రువును పేక్షిస్తే శాశ్వతనాశం తప్పదు :**

**యో హి శత్రుమభిజ్ఞాయ నాత్మానమభిరక్షతి।**

**అవాప్నోతి హి సోఽనర్థాన్ స్థానాచ్చ వ్యవరోప్యతే॥** 63-20

మంత్రుల్లో ఎవడు తన శత్రువో గుర్తించి, మహారాజు తనను, తన రాజ్యాన్ని కాపాడుకోవాలి. అలా కాకపోతే అతడెన్నో అనర్థాలకు గురై, చివరకు పదవీభ్రష్టుడౌతాడు.

ఎప్పుడూ తన శత్రువుల్ని ఒక కంట కనిపెట్టే ఉండాలి. వాళ్ళ కదలికలను గమనిస్తూనే ఉండాలి. తన మంత్రివర్గంలోనే కొందరు గూఢ శత్రువులు ఉంటారు. వాళ్లను గుర్తించి తగిన జాగ్రత్తలు తీసుకోకపోతే రాజుకు, రాజ్యానికి కూడా వాళ్ళు ముప్పు తెచ్చిపెడతారు. అందువల్ల బాహ్య శత్రువుల కంటే అంతశ్శత్రువులను అదుపులో పెట్టుకోకపోతే ఆత్మవినాశం, రాజ్యవినాశం అనివార్యమౌతుంది.

**160. పోయిందేదో పోయింది; ఇప్పుడు జాగ్రత్తపడు :**

**అస్మిన్ కాలే తు యద్యుక్తం తదిదానీం విధీయతామ్।**
**గతం తు నానుశోచన్తి గతం తు గతమేవ హి॥ 63.25**

గడచిపోయిందేదో గడిచే పోయింది. దాన్ని గురించి ఎవరూ ఆలోచించరు. ఇప్పుడేం చేస్తే బాగుంటుందో బాగా ఆలోచించి, జాగ్రత్తగా దాన్ని వెంటనే అమలు పరుచు !

జరిగి పోయిందాన్ని గురించి చింతించి ప్రయోజనం లేదు. జరిగి పోయిందేదో జరిగిపోయింది. గడచిన కాలాన్ని తిరిగి సంపాదించగలమా ? ఏ పరిస్థితిలోను తిరిగి సంపాదించలేం. కాబట్టి జ్ఞానం కలవాళ్ళు గడిచిపోయిందాని కోసం బాధ పడరు ఇప్పుడు ఏం చేయాలో బాగా ఆలోచించి దాన్ని వెంటనే చేయడమే ముఖ్య కర్తవ్యం. పోయిందానికోసం ఏడ్చి వాపోతే వచ్చేదేమీ లేదు.

**161. వాడే మిత్రుడు; వాడే బంధువు :**

**స సుహృద్యో విపన్నార్థం దీనమభ్యవపద్యతే।**
**స బంధుర్యోఽపనీతేషు సాహాయ్యాయోపకల్పతే॥ 63.27**

ఆపదల్లో ఉన్న దీనుణ్ణి ఎవడు కాపాడుతాడో వాడే నిజమైన స్నేహితుడు. కష్టాల్లో ఉన్నప్పుడు కూడా వెంటనే ఉండి ఎవడు సాహాయ్యం చేస్తాడో వాడే నిజమైన బంధువు.

అన్నీ బాగున్నప్పుడు మేమున్నామని ఎందరో చుట్టూతా చేరతారు బెల్లం చుట్టూ చీమలు చేరినట్లు. కానీ ఆపదల్లో ఉన్నవాడిని ఎవరూ పట్టించుకోరు. విపత్తుల్లో వెన్నంటి ఉండి ఆదుకున్నవాడే నిజమైన స్నేహితుడు. కష్టాల్లో ప్రాణానికి ప్రాణం అడ్డంవేసి సాహాయ్యం చేసేవాడే సరైన బంధువు. అలా కాక సుఖసంతోషాల్లో వెంట ఉండి, కష్టాల్లో వదిలేసి వెళ్ళేవాడు రాబందునే కాని బంధువు మాత్రం కాదు.

**162.** ధనమూల మిదం జగత్ :

అర్థేన హి వియుక్తస్య పురుషస్యాల్పతేజసః।
వ్యుచ్ఛిద్యన్తే క్రియాస్సర్వాః గ్రీష్మే కుసరితో యథా॥ 83_33

యస్యార్థాస్తస్య మిత్రాణి యస్యార్థాస్తస్య బాంధవాః।
యస్యార్థాస్స పుమాంల్లోకే యస్యార్థాః సచ పండితః॥ 83-35

సిరి సంపదల్లేకుండా కాంతి విహీనుడుగా ఉన్నవాడి కార్యక్రమాలన్నీ మండుటెండల్లో నీళ్ళెండిన పిల్లయేర్లలాగా నామరూపాలు లేకుండా పోతాయి. ధనవంతుడికే మిత్రులు, బంధువులు ఉంటారు. ఈ లోకంలో సిరిగలవాడే మగవాడు, అతడే పండితుడు.

ఎవరెన్ని మాటలు చెప్పినా, ఎక్కువగా లేకపోయినా కావలసినంత వఱకు డబ్బు ఉండేతీరాలి. కావలసినదానికంటే ధనం ఉంటే అది కష్టాలను కొనితెస్తుంది. అవసరాలకు చాలీచాలని డబ్బు ఆత్మాభిమానాన్ని దెబ్బతీస్తుంది. 'డబ్బు లేనివాడు డుబ్బుకు కొఱగాడు' అని అందుకే పుట్టింది సామెత. నిర్ధనుడు ప్రారంభించిన పనులు మధ్యలోనే ఆగిపోతాయి. ఎండాకాలంలో ఎండిపోయిన పిల్లయేళ్లలాగా నామ రూపాలు లేకుండా నశించిపోతాయి. డబ్బున్న వాడిదే రాజ్యం వాడికే మిత్రులుంటారు. బంధువులందఱు వాడి చుట్టూతా చేరతారు. డబ్బునుబట్టే గొప్పవాడుగా పేరు ప్రసిద్ధి వస్తుంది డబ్బున్నవాణ్ణి గొప్ప పండితుడంటుంది ఈ లోకం. అందుకే 'డబ్బుకు లోకం దాసోహం' అంటారు పెద్దలు.

**163.** పరాయివాడు పరాయివాడే।

గుణవాన్వా పరజనః స్వజనో నిర్గుణోఽపి వా।
నిర్గుణః స్వజనః శ్రేయంన్యః పరః పర ఏవసః॥ 87_15

గుణవంతుడైన పరాయివాడు నయమా? గుణరహితుడైన తనవాడు నయమా? అంటే; ఏ గుణాలు లేకపోయినా ఆత్మీయుల్నే దగ్గఱికి చేర్చాలి. పరాయివాడు ఎన్నటికీ స్వంతవాడు కాలేడు.

మన దగ్గఱకు ఎంతమందో చేరుతుంటారు. వాళ్లల్లో ఎవరి మీద విశ్వాసం పెట్టవచ్చు? ఎవరిని దూరంగా పెట్టాలనేది మీమాంస. ఒకడు మంచి గుణగణాలు కలవాడు; అయితే పరాయివాడు. ఇంకొకడు ఏ సద్గుణాలు లేనివాడు అమాయకుడు, స్వంతవాడు. వీళ్ళిద్దఱిలో ఎవరిని దగ్గఱకు చేర్చాలి - అంటే సద్గుణాలు, శక్తి సామర్థ్యాలు లేకపోయినా స్వంతవాణ్నే దగ్గఱ పెట్టుకోవాలి. పరాయివాడు ఎప్పటికైనా పరాయివాడే అవుతాడు.

**164.** పరపక్షం పంచ; పరలోకానికి మంచె :

యః స్వపక్షం పరిత్యజ్య పరపక్షం నిషేవతే।
స స్వపక్షే క్షయం ప్రాప్తే పశ్చాత్తైరేవ హన్యతే॥ 87-16

స్వపక్షాన్ని వదిలిపెట్టి శత్రువులతో చేతులు కలుపుతారు కొందఱు. కాని శత్రువులు వీడి సహాయంతో పరపక్షాన్ని నాశనం చేసి, చివఱకు వాణ్ణి కూడా చంపేస్తారు.

తమ నాయకుణ్ణి వదిలి శత్రువుల పంచన చేరుతారు కొందరు వంచకులు. శత్రువు వాణ్ణి సాదరంగా ఆహ్వానిస్తాడు. ప్రతిపక్షంలో చిచ్చుపెట్టడానికి, రహస్యాలను తెలుసుకోవడానికి కాని ప్రతిపక్షాన్ని వాడి ద్వారానే నాశనంచేసి, తనకు ప్రతిపక్ష రహస్యాలనందించిన వీణ్ణిగూడ తుట్టతుదకు తుదముట్టిస్తాడు. ఎందువలనంటే, వీడు తన రహస్యాలను గూడ విరోధులకందిస్తాడనే భయం వాణ్ని వీడిస్తుంది. పక్షాలను మార్చేవాడు బాగుపడటం కష్టం.

**165.** మూడు దోషాలుంటే ముంచేస్తాయి :

పరస్వానాం చ హరణం పరదారాభిమర్శనమ్।
సుహృదామతిశంకా చ త్రయో దోషాః క్షయావహాః॥ 87-24

ఇతరుల డబ్బు కాజేయడం, పరకాంతల పొందు కోరడం, స్నేహితులను అవమానించడం, ఈ మూడు దోషాలు ఎవరినైనా నాశనం చేస్తాయి.

తేరగా ఇతరుల ఆస్తిపాస్తులను అపహరించాలనుకోవడం, పరస్త్రీలపై మమకారం, విశ్వాసపాత్రులైన స్నేహితులపై అనవసరమైన అనుమానాలు పెట్టుకోవడం- ఈ మూడుదోషాలు ఎవరిలో ఉంటే వారు పైకిరారు. ఏదో ఒక వైపునుంచి వాళ్ళ అంతాన్ని వాళ్ళే కొనితెచ్చుకుంటారు. కనుక ఇలాంటి లక్షణాలను ఎంత త్వరగా వదిలిపెడితే అంత మంచిది.

**166.** వ్యర్థప్రతిజ్ఞలు అనర్థాలకు మార్గాలు :

న హి ప్రతిజ్ఞాం కుర్వన్తి వితథాం సాధవోఽనఘ। 102-49

సత్పురుషులు వ్యర్థమైన ప్రతిజ్ఞలు చేయరు.

దేశకాలాలను, తన శక్తిసామర్థ్యాలను దృష్టిలో పెట్టుకోకుండా సజ్జనులు వ్యర్థంగా శపథాలు చేయరు. నీతినియమాలు లేనివాడు వందలకొలది వాగ్దానాలు చేస్తూ ఒక్కటికూడా పూర్తిచేయడు. కాని సత్పురుషులు ఒక్కమాట చెప్పినా దానికి కట్టుబడతారు. వ్యర్థమైన ప్రతిజ్ఞలవల్ల సమాజంలో అనర్థాలేర్పడతాయి.

**167.** వైరాలన్నింటికి మరణమే సరిహద్దు :

మరణాన్తాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్। 112-26

శత్రువు మరణించిన తరువాత అతడిమీద వైరం కూడా నశించాలి.

విరోధాలు శాశ్వతంగా ఉండకూడదు. శత్రువు మరణించిన తరువాత కూడా విరోధం ఉండటంలో అర్థంలేదు. వ్యక్తితో ఏర్పడ్డ విరోధం ఆ వ్యక్తి తోనే అంతం కావాలి. మిత్రానాళ్ళపైన కక్ష సాధించడానికి ప్రయత్నించ కూడదు.

**168.** **మంచికి మంచి; చెడుకు చెడు :**

**శుభకృ చ్ఛుభ మాప్నోతి పాపకృత్పాప మశ్నుతే,** 114-26

లోకానికి మంచి చేసేవాడికి మంచే కలుగుతుంది; చెడు చేసేవాడికి చెడే సంభవిస్తుంది.

'న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి' అంటుంది గీత. మంచి ఉద్దేశాలతో సమాజానికి మంచి చేసేవాడికి ఎన్నటికీ మంచే కలుగుతుంది. ఉద్దేశ్యం మంచిదై ఉండాలి. చెడు ఉద్దేశ్యాలతో మంచి చేస్తున్నట్లు అభినయం చేసినా, అతడు చివటికి చెడిపోతాడు. మంచి చేస్తే పుణ్యం, చెడుచేస్తే పాపం తప్పక కలుగుతుంది. 'పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్' అని కదా సూక్తి !

**169.** **చచ్చిపోవడానికి పిచ్చినెపమేదో కావాలి :**

**సర్వథా సర్వభూతానాం నాస్తి మృత్యురలక్షణః।** 114-29

ఏ జీవి చనిపోవడానికైనా ఏదో ఒక నెపం కావాలి.

ప్రారబ్ధం నశిస్తే ప్రాణం క్షణం నిలవదు. ప్రాణంపోయే ముందు ఏదో ఒక వంక తప్పకుండా ఏర్పడుతుంది. రోగమో, ప్రమాదమో ఏదో ఒకటి వచ్చే మనిషి చనిపోతాడు. ఎంత అదృష్టవంతులకో గాని అనాయాస మరణం రాదు. 'అనాయాసేన మరణం వినా దైన్యేన జీవనమ్' కావాలని ప్రతివాడు కోరుకుంటాడు.

**170.** **పతివ్రతల కన్నీళ్ళు ఫలితం లేకుండా పోవు :**

**పతివ్రతానాం నాకస్మా త్పత న్త్యశ్రూణి భూతలే,** 114-67

పతివ్రతల కళ్ళనీళ్ళు భూమిపైనబడితే ఫలితం చాలా తీవ్రంగా ఉంటుంది.

పతివ్రతలను బాధపెట్టినవాళ్ళు పచ్చగా పది కాలాల పాటుండరు. పతివ్రతల కన్నీళ్ళు భూమిపైన పడితే అది గజగజలాడిపోతుంది. ప్రకృతిలో విపరీతాలు సంభవిస్తాయి. అసంభావ్యాలు జరుగుతాయి. సమాజానికి సుఖశాంతులుండవు. కనక పతివ్రతలను బాధపెట్టడం మంచిదికాదు.

**171.** **తప్పు చెయ్యని వాడెవడు ?**

న కశ్చిన్నాపరాధ్యతి। 116-45

ప్రతివాడు తప్పుచేస్తాడు. తప్పు చెయ్యనివాడు ఎవ్వడూ లేడు.

తన తప్పులు తనకు తెలియవు ప్రతివాడు తప్పులు చేసేవాడే. తరతమ భేదం ఉండచ్చుగాని, నేను తప్పే చెయ్యలేదని ఎవ్వడూ చెప్పలేడు. కాబట్టి ఇతరులను కనికరించాలి. ఇది తల్లి సీతమ్మ మారుతికి చెప్పినమాట.

**172.** **స్త్రీకి సౌశీల్యమే నిజమైన ఆవరణం :**

న గృహాణి న వస్త్రాణి న ప్రాకారా స్తిరస్క్రియాః।
నేదృశా రాజసత్కారా వృత్తమావరణం స్త్రియః॥ 117-26

మిద్దెలు, మేడలు, చీనిచీనాంబరాలు, ప్రాకారాలు, రాజ సత్కారాలు స్త్రీకి గౌరవాన్నిచ్చే ఆవరణలు కావు. ఆమెకు సౌశీల్యమే నిజమైన ఆచ్ఛాదన.

తన శరీరాన్ని కప్పిపుచ్చుకోవడానికి, సిగ్గును దాచుకోవడానికి ఎన్నెన్ని వస్త్రాలు కట్టుకున్నా, భవనాంతరాలల్లోఉన్నా, చుట్టూ ప్రాకారాలు కట్టించుకున్నా స్త్రీకి సౌశీల్యమే నిజమైన ఆవరణం యదార్థమైన ఆచ్ఛాదన. అదే లేక పోయిన తరువాత ఎన్ని భవనాల మధ్య ఎన్ని గుడ్డలుకప్పుకొని కూచున్నా; నిరావరణగా ఉన్నట్లే. కనుక స్త్రీజాతి సౌశీల్యాన్ని చక్కగా కాపాడుకోవాలి.

# ఉత్తరకాండ

**173.** **ఆపదలో అందరినీ ఆదుకోవాలి :**

నరః ప్రత్యుపకారాణాం ఆపత్స్వాయాతి పాత్రతామ్। 40-22

ఆపదలో ఉన్నప్పుడే మానవుణ్ణి అందరు ఆదుకోవాలి.

తనకు ఉపకారం చేసినవాడు ఆపదల్లో ఉన్నప్పుడు ప్రత్యుపకారానికి పాత్రుడౌతున్నాడు. అప్పుడతడికి తప్పకుండా ఉపకారం చేయాలి. తనకు ఉపకారం ఇదివరకు చేసినా, చేయకపోయినా-అపకారమే చేసి ఉన్నా, ఆపదల్లో ఉన్నప్పుడు అతడికి ఉపకారం చేయడమే గొప్పగుణం - అపకారికి ఉపకారం చేయగలవాడే మహాత్ముడు.

తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమ సాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషి చేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషి చేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3